10-1-1992 శుక్రవారం 20 పేజీలు సంపుటి :63 సంచిక :2 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



## జానకిరాం, రవీంద్ర జగడం!

రాజకీయాలలో ఎప్పుడెప్పుడు ఎవరెవరు ఎందుకు మిత్రులుగా కలిసి పోతారో, శత్రువులుగా కత్తులు దూస్తారో కనిపెట్టడం బ్రహ్మతరం కూడా కాదు. రాష్ట్ర మంత్రి వర్గంలో జంట కవుల వలె, లారెల్ అండ్ హార్డీ వలె మెలగుతుండే రెవిన్యూ మంత్రి శ్రీ డి.ఎల్. రవీంద్రరెడ్డి, గనుల మంత్రి శ్రీ మాదాల జానకిరాంల మధ్య అభిప్రాయ భేదాలు రావడం కూడా ఈ కోవకు చెందిన అనూహిత పరిణామమే! చెన్నారెడ్డి హయాం నుంచి వీరిద్దరూ మంచి మిత్రులు. ఆనాటి అసమ్మతి యుద్ధంలో జానకిరాం 'ఐటపోయిన బొక్స్ మెన్'గా వ్యవహరిస్తే రవీంద్రరెడ్డి సర్వసైన్యాధిపతిగా పని చేసారు. రవీంద్రరెడ్డికి ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డితో సాన్నిహిత్యం జాస్తి. తెలుగుదేశం హయాంలో సైతం ఆయన 'జనప్రియ' కు రాక పోకలు సాగించే వారు. ఆ స్నేహ భావమే ఆయన రాజశేఖర రెడ్డికి విశ్వాస పాత్రుడని తెలిసినా జనార్దన రెడ్డి మంత్రి వర్గంలో కీలకమైన శాఖ పొందగలగడానికి కారణమైంది. జానకిరాంకు మంత్రి పదవి తెచ్చిపెట్టడంలో సైతం ఈ చనువే ఉపకరించింది. జానకిరాంకు మంత్రి పదవి ఇస్తే వచ్చే ప్రమాదాలు, ఇవ్వకుంటే వచ్చే ప్రమాదాలు ముఖ్యమంత్రికి వివరించి, రెండింటిని బేరీజు వేయించి, పొయ్యిలోకి జారడం కంటే పెనం మీద వుండడమే నయమని నచ్చచెప్పి ముఖ్యమంత్రిని సానుకూల పరచడంలో రవీంద్రరెడ్డి చాలా పగళ్ళు, రాత్రుళ్ళు చాలా ఖర్చుపెట్టారు. "యానాది రెడ్డి" నుంచి "క్లియరెన్స్" కావాలనే నెరవేర్చలేని షరతును తప్పించి ఆఖరు నిముషంలో కూడా మాట సాయం చేశారు. అప్పటి నుంచి అన్నదమ్ముల వలె తిరుగుతుండిన వీరిద్దరు యువమంత్రులూ ఇప్పుడు ఎడముఖం, పెడముఖంగా వ్యవహరించడం పరిశీలకులను విస్మయపరుస్తున్నది.

ఇటీవల జరిగిన ఒక క్యాబినెట్ సమావేశంలో వీరిద్దరి స్వర్ధలు వెల్లడైనాయి. సబ్సిడీ బియ్యం పథకంపై చర్చ దీనికి కారణం. ఎనిమిది వందల కోట్ల రూపాయలు ఖర్చు అవుతున్న ఈ పథకాన్ని రద్దు చేయకుంటే రాష్ట్ర ప్రభుత్వం ఆర్థికంగా దివాలా తీస్తుందని, అభివృద్ధి కార్యక్రమాలన్నీ నిల్చిపోతాయని, ఓట్లకోసం రాష్ట్ర ప్రజలకు అంత అన్యాయం చేయడం తగదని ఆ సమావేశంలో రవీంద్రరెడ్డి వాదించాడట. రోశయ్య, పాలడుగు వెంకట్రావులు పథకం రద్దు చేసే కంటే ధర పెంచడం ద్వారా ఉభయ తారకంగా సమస్య పరిష్కరించుకోవాలని సూచించారట. జానకిరాం మాత్రం రెండింటినీ వ్యతిరేకించి పథకాన్ని యదాతథంగా కొనసాగించి తీరాలని పట్టుబట్టాడట. సమావేశంలో వాదోపవాదాలు జరిగాయి. ఒక దశలో రవీంద్రరెడ్డి "ఇది ప్రజలకు మనం తెలిసే చేస్తున్న అన్యాయం. ఆ ప్రజల దగ్గరకే పోయి పరిస్థితి వివరించ వలసివస్తుంది" అన్నాడట. ఆ మాటకు చప్పున జానకిరాం కల్పించుకొని "పోవాలనే ఉద్దేశ్యంలో వున్నవారు వెళ్ళి పోవడానికి ఇటువంటి సాకులు వెతుకుతారు అని వ్యాఖ్యానించారట. అది రవీంద్రరెడ్డిని చురుక్కు మనిపించింది. ఇద్దరి మధ్య మాటల యుద్ధానికి దారి తీసింది. రవీంద్రరెడ్డి రాజశేఖరరెడ్డి మనిషి కాబట్టి, ఏదో ఒక నెపంతో ముఖ్యమంత్రి నుంచి దూరంగా తప్పుకో జూస్తున్నాడన్న అంతరార్థం జానకిరాం మాటల్లో ధ్వనించింది. అప్పటి నుంచి ఇద్దరి మధ్య ఎడం మరీ పెరిగింది.

కడప జిల్లా రాజకీయాలలో తనను పక్కకు నెట్టి, మైసూరా రెడ్డికి అధిక ప్రాధాన్యం ఇస్తున్నారన్న సందేహం రవీంద్రరెడ్డిలో చాలాకాలం నుంచి

కొరవ 11 వ పేజీ

## అర్జునరావు పై కరపత్రం

గతవారంలో సిఎం కార్యదర్శి శ్రీ మాధవరావు పై వచ్చిన తరహాలో ఈ వారం రెవిన్యూ కార్యదర్శి శ్రీ సి. అర్జునరావు పై కరపత్రం విడుదలైంది. అవినీతి కథలు వ్యసనాల గుట్టుమట్టులు బయట పెట్టే ఆ కరపత్రం క్రింద 'అవినీతి పై పోరాడే ఎమ్మెల్యే' అని వ్రాశారు. గతంలో వచ్చింది అందంగా ముద్రించివుంటే, దీన్ని హడావుడిగా సైక్లోస్టైయిల్ చేసి విడుదల చేసేశారు.

ఈ రాష్ట్రానికి పాలకులు వీరు. పాలితులం మనం — ఖర్మ!

# పినాకినీ తీరం

## నేడూ ఆచార్యుడే!

ఆచార్య అనే పదం కొందరికి అలంకారప్రాయం; కొందరికి ఆడంబర సహితం; కొందరికి హోదా సంకేతం; కొందరికి సవయమారోపితం; కొందరికి వరుస వృత్తిరీత్యా సంక్రమితం, రంగా గారి విషయంలో మాత్రం అదిసార్థకం!

అరవై ఏళ్ళ క్రితం, ఎప్పుడో ఎంతకాలమో విశ్వవిద్యాలయాల్లో కళాశాలల్లో ప్రొఫెసర్‌గా పనిచేశారు; అనాడు పిల్లలకు పాఠాలు ఎట్లా బోధించారో, ఈనాడూ అదే విధంగా తన ఎదుటవున్న వారికి వర్తమాన రాజకీయ ఆర్థిక సామాజిక పరిస్థితులను గూర్చి, సమస్యలను గూర్చి బోధిస్తూనే వున్నారు. వయస్సు పైనబడింది; శరీరం కృశించింది; ఓపికతగ్గినంది; కాని వుత్సాహం మాత్రం ఆయనలో ఇసుమంత కూడా తరగలేదు. నీ అభిప్రాయాలతో ఆయనకు అవసరంలేదు; నీ అనుకూల ప్రతికూలాలతో నిమిత్తం లేదు; నువ్వు అడగవలసిన అవసరం కూడా లేదు; తనకు తానుగా వివిధాంశాలను తనదైన ధోరణిలో విడమరచి చెప్పుకుంటూ విశ్లేషించుకుంటూ, సమీక్షించు కుంటూ పోతారు. ఆయన సాన్నిధ్యం – కొద్దిపాటి సమయమైనా – విలువైనది, విజ్ఞానదాయకమైనది, ప్రయోజన కరమైనది. ఎప్పుడైనా, ఎక్కడైనా ఆయన ఆచార్యుడే, ఆయన చుట్టూ వున్న మనం విద్యార్థులం! నా యాభై ఐదేళ్ళ పరిచయంలో రంగాగారు నాడు, నేడు ఒకటే!

మొన్న 4వతేది తిరుపతికిపోతూ రైలు ఆటంకం వల్ల నెల్లూరులో రెండు గంటలపాటు గడిపారు రంగాగారు. నేను ఆయన వద్ద ఒక అర్ధగంట కూర్చుంటె విశ్వదర్శనం అయింది. ప్రాంతీయ భావాలు, భాషాతత్వాలు కులమత మౌఢ్యాలతో అస్తవ్యస్తంగా వున్న మనదేశానికి సోవియట్‌రష్యా విచ్ఛిన్నత ఒక తీవ్ర హెచ్చరికని ఆయన అభిప్రాయం. దేశం ఉత్తర దక్షిణాలుగా, తూర్పు పశ్చిమాలుగా ఎక్కడ చిన్నాభిన్నం అవుతుందోనని ఆయన భయాందోళన. కాశ్మీర్ విషయంలో ఆయన ఆలోచన, అభిప్రాయం వాస్తవికంగా వుందేమో ననిపించింది. చైనాలో కూడా ఒకరోజు సోవియట్ పరిణామం అనివార్యమేమో నంటారాయన. తెలుగు దిన పత్రికల జిల్లా ఎడిషన్లలోని వార్తలు మరీ దిగజారుడుగావున్నాయని, వాటివల్ల స్థానిక పత్రికలు దెబ్బతినిపోతాయని రంగాగారు వెలిబుచ్చారు. జిల్లా ఎడిషన్లను గూర్చి బహుజనాభిప్రాయం ఇది. ఈ విధంగా ఎన్నో విషయాలు సమస్యల మీద వ్యక్తులకు సంబంధించి విశ్లేషణాత్మకమైన ఆయన పరిశీలన చూస్తే రంగాగారి ఆలోచనా పటిమ ఇంకా ఎంత పటుత్వంగా, నిశితంగా వుందా అనిపించింది. పార్లమెంటు సభ్యుడుగా ఢిల్లీలోని తన క్వార్టర్సు ఇంకా ఖాళీ చేయలేదట. "దానికి ఎంత అద్దెకట్ట వుంటారో, నేనెక్కడ తెచ్చేది. పైగా ఢిల్లీలో వుండాలంటే హిందీ తెలుగు వచ్చిన విశ్వాసపాత్రుడైన సహాయకుడు కావాలి. అటువంటివాడు ఇప్పుడెక్కడ దొరు కుతాడు?'' అన్నారు రంగాగారు. రంగాగారి స్వభావంలో వలె ఆయన నిరాడంబరతలో కూడా మార్పేలేదు. ఆయన ఇకముందు ఎక్కువకాలం హైదరాబాదు, నిడుబ్రోలులలో వుండేట్లుంది. నిడుబ్రోలులో తన మేడలో కాకుండా, ఆ ప్రాంగణంలోనే వున్న 'గోభూమిలో' గడుపుతున్నారట "పదవులు, సంపాదనలే ప్రధానమైన అప్పటివారితో నాకెక్కడ కుదురుతుంది?" అన్నా రాయన.

రంగాగారి ఆత్మీయతారుణం తీర్చుకోలేనిది. ఆయన ఆరవై ఒకటవ శతాబ్దపు పౌరుడు కూడా కావాలని నా ప్రగాఢ వాంఛ!

## వర్గాల పునరేకీకరణ

ఈ విషయానికిపోయే ముందు గతవారం నా వ్రాతమీద ఒక పాఠకుని టెలిఫోన్ వ్యాఖ్యానం వినిపిస్తాను –

"మతిభ్రమణమే అన్న గతవారపు మీ విమర్శ చదివాను. పేరు ఎత్తకపోయినా అది ఎవరి నుద్దేశించిందీ చదివిన ప్రతివాడికి తెలుస్తుంది. ఆ మతిభ్రమణము, ఆ పిచ్చి ఏదైనా వుంటే నీకే గాని, అతనికెం కాదు. జనార్దనరెడ్డి వున్న పార్టీలో ఆయన వుండలేడు. తానుగా బయటకుపోడు, గెంటబడే పరిస్థితులు కల్పించుకొని, మరో పార్టీలో దూరుతాడు. అదునెరిగి విత్తనం నాటే అవకాశవాదపు రాజకీయ కృషీవలుడాయన. అందువల్ల పార్టీ వ్యతిరేక చర్యలకు ఆయనపై క్రమశిక్షణ చర్యతీసుకోలేరని మీరు అనుకోవడం రాజకీయ సూక్ష్మాలు తెలియని వెర్రితనం. ప్రస్తుతం ఆయన కాంగ్రెస్‌లో వుండడమే మేలు. అసలు ప్రజలు పట్టించుకొనని ఆ రాజకీయవాదిని గూర్చి మీ పత్రికలవారు పట్టుకొని వూగులాడడం ఎందుకు? అందరి సంగతి పోనీండి, మీ వరకు మీరు ఆయన్ను విస్మరించడం మంచిది."

మాటలు అవేనని ఖచ్చితంగా చెప్పలేను గాని, ఫోన్‌లో అడగకుండా సలహా యిచ్చిన ఆ పాఠకుని అభిప్రాయాలు మాత్రం అవే! నిజమే, ఇలాంటి నాయకుల ప్రకటనలు చదవకుండడం, ఆవేశ పడకుండడం ఆరోగ్యకరమేననిపిస్తుంది.

దాన్ని అట్లా వుంచుదాం. ఈ వారంలో జిల్లాలో సహకార సంఘ ఎన్నికల ముసుగులో జిల్లాలోని ఒక రాజకీయ కుటుంబం పార్టీ హద్దులను ప్రక్కన బెట్టి పునరేకీకృతమైంది. ఈ పరిణామం అనూహితమూ కాదు, ఆశ్చర్యమూ కాదు – అందరూ అనుకొంటుందిదదే! అప్పుడు బహిరంగంగా ఒకే వేదికనెక్కారని గాని, అజ్ఞాతంగా ఈ పని ఎప్పుడో జరిగిపోయింది. అందువల్ల దీనికి పెద్దగా ప్రాధాన్యత ఇవ్వవలసిన

కొరవ 11 వ పేజీ కొరవ

# ఈ జనవరి తొమ్మిది మా తొలి జన్మదినం
# మీ ఆదరణకు మా అభివందనం !

తియ్యని తలపులకు
మీ మది తలుపులు తెరిచే
మనోల్లాస వాతావరణం

శ్రీమతి చేతి వంటలోని ప్రేమానురాగం
అమ్మ వడ్డనలోని అప్యాయానుభూతి
మేళవించిన సవినయ సర్వీసింగ్

నలభీమపాకాన్ని మరిపించే
చూడగానే నోట్లో నీళ్ళూరించే
షడ్రుచుల సమ్మేళన వంటకాలు

## మా మందాకిని బార్‌లో మీకు అందుతాయి

గొప్పకు చెప్పడం కాదు కాని —
సాఖీ గాజులు చేయి సురా పాత్ర నింపగానే
ఉమర్ ఖయామ్‌లో కవితారసం
వరద గోదావరిలా ఉప్పొంగినట్లు

మందాకినిలో విందారగిస్తే
మీలో ఉత్సాహం ఉరకలేయడం ఖాయం

## మందారమకరంద మాధుర్యములు
## మీ కందించే మధుర నిలయం

రుచికి! శుచికి!! స్వచ్ఛతకు!!!
కమ్మని మధుపానీయములకు

# మందాకిని బార్ & రెస్టారెంట్

ఆచారి వీధి నెల్లూరు

మాతో సహకరించిన హోటల్ శివమ్ ఇంటర్నేషనల్ డైరక్టర్స్‌కు, శ్రేయోభిలాషులకు,
హోల్‌సేలర్స్‌కు, ఖాతాదారులకు మా శుభాకాంక్షలు

# పామ్ఆయిల్ : రైతు సమస్య కాదు, దేశ సమస్య !

సాంప్రదాయ వ్యవసాయంతో విసిగిపోయి, గిట్టుబాటు లేక నష్టాలతో పాటు కష్టాలనూ సమంగా అనుభవిస్తున్న రైతాంగానికి ఆశాకిరణం వలె వచ్చి ప్రస్తుతి — పామ్ ఆయిల్! రెండు దశాబ్దాల క్రితం, మన జిల్లా వరకు వ్యవసాయమంటే వరిసాగు మాత్రమే. మెట్టపల్లెలను మినహాయిస్తే తోట పైర్లు చాలాచాలా అరుదు. వ్యవసాయంలో వాణిజ్యోద్దేశాలను తొలుతగా ప్రవేశపెట్టింది పొగాకు. స్తోమత వున్న రైతులు పొగాకు సాగుతో పెద్దాస్థి లాభ దాయకంగా మలచుకున్నారు. అందు లోను నష్టపోయినవారూ లేకపోలేదు. జిల్లా రైతాంగానికి వాణిజ్య పంటగా స్థిర పడింది చెరకు మాత్రమే. కోవూరు చక్కెర ఫ్యాక్టరీ స్థాపన జరిగిన తొలిదినాలలో చెరకును నమ్ముకొనినవారి సంఖ్య అపరిమిత మైనప్పటికీ, తర్వాత తర్వాత చెరకు సాగు రైతాంగం జీవన సరళిలో చాలా మార్పులు తెచ్చింది. ఇటీవల కాలంలో చేపల పెంపకం రైతాంగానికి వర ప్రసాదంగా అవతరిస్తున్నది. గ్రామాలకు గ్రామాలే చేపల చెరువులుగా మారి పోతున్నాయి. ఎకరమున్న రైతునుంచి వంద ఎకరాల భూస్వామ్య కుటుంబం వరకు వరికి తిలాతర్పణం అర్పించి చేపల పెంపకందారులుగా మారిపోతున్నారు.

ఈ క్రమంలో రైతులకు లభించిన మరొక వాణిజ్యపదవకాశం— పామ్ ఆయిల్ తోటల పెంపకం! మలేషియా, ఇండోనేషియా వంటి దేశాలలో రైతుల ఆర్థిక స్థితిగతులను తలక్రిందులుగా మార్చిన లాభాల పంట పామ్ ఆయిల్. రైతులకే కాదు — దేశ ఖజానాలకు సైతం పామ్ ఆయిల్ పసిడి గని వంటిదే! వంటనూనెలకు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న కొరత దృష్ట్యా నూనె గింజలకు విదేశీ మారకద్రవ్యానికి అవినాభావ సంబంధం ఏర్పడింది. మనదేశంవరకు చూసినా ఏడాదికి మూడువేల కోట్ల రూపాయల విలువైన విదేశీ మారకద్రవ్యం ఆయిల్ దిగుమతికి ఖర్చు పెట్టవలసి వస్తుంది.

ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి పామ్ఆయిల్ తోటల పెంపకం రైతు సమస్యకాదు — దేశ సమస్య అన్నారు. జిల్లా ప్రజాపరిషత్ సమావేశమందిరంలో వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో ఈ సదస్సు జరిగింది. కలెక్టరు శ్రీ కె. రాజా అధ్య క్షించారు. శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి, ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి, చక్కెర ఫ్యాక్టరీ అధ్యక్షుడు శ్రీ సామంతు సుబ్బారెడ్డి, జాయింట్ కలెక్టరు శ్రీ సాంబశివరావు, వ్యవసాయ శాఖ జాయింట్ డైరెక్టర్ శ్రీ రాజేంద్ర ప్రసాద్ తదితరులు మాట్లాడారు.

సుబ్బరామిరెడ్డి మాట్లాడుతూ నెల్లూరుకు తీసుకొని రావడంలో ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి కృషి ప్రశంసనీయమైనదని ప్రస్తుతించారు జె.కె. రెడ్డి. హెచ్.కె. బాబుకి కూడా ధన్యవాదాలు చెప్పారు. పై అధికారులు మొదట నెల్లూరు జిల్లా ఈ తోటల పెంపకానికి వీలుకాదని వ్రాసి పంపారని, అయితే హెచ్.కె. బాబు, జనార్దనరెడ్డిల స్థిర నిర్ణయం వల్ల ఈనాడు ఆకారరూపం ధరించిందని చెప్పారు. తుఫానుకు గురయ్యే నెల్లూరు ప్రాంతానికి ఇది వరప్రసాదమని, గింజల నుంచి నూనె తీయడానికి ప్రభుత్వం ఫ్యాక్టరీ పెడతానని ఇచ్చిన హామీని నిలుపుకోలేకపోతే

## ఖర్చు పాతికవేలు — ఆదాయం ఏటా లక్ష !

### అధికారుల లెక్కలు వింటే నోట్లో నీళ్ళూరుతున్నాయి

అయినా స్వదేశీ మార్కెట్లో నూనెధర అదుపులో లేదు. దాన్ని అదుపు చేయా లంటే మరింత నూనె దిగుమతి చెయ్యాలి. మరింత విదేశీ మారకద్రవ్యం ఖర్చు పెట్టాలి. ఆ స్తోమత దేశానికి లేదు. స్థానికంగా ఉత్పత్తి పెంచడం ఒక్కటే తరుణోపాయం. రాత్రికి రాత్రి జరిగే పనికాకపోయినా, ఈ రోజు మొదలుపెడితే మరి ఐదేళ్లకైనా నూనెకోసం డాలర్లు ఖర్చు చేయాల్సిన అగత్యం తప్పుతుంది.

ఇది దృష్టిలో పెట్టుకునే మొన్నటి పామ్ఆయిల్ రైతు సదస్సులో ఒంగోలు విదేశీ మారక ద్రవ్యం కొరతను నివారించడంతోపాటు, ఆయిల్ కొరతనూ తగ్గించే పామ్ చెట్ల పెంపకాన్ని రైతులు పెద్ద ఎత్తున చేపట్టాలని కోరారు. జె.కె. రెడ్డి స్వయానా పామ్ ఆయిల్ రైతు. సర్వేపల్లి దగ్గర ఆయన కుటుంబీకులు 120 ఎకరాలలో ఈ తోటల పెంపకం చేపట్టనున్నారు. పామ్ ఆయిల్ పథకాన్ని

**రైతులోకం**

1000 ఎకరాల తోటలకు సరిపడా లానే ఒక ఫ్యాక్టరీ పెడతానని ప్రకటించారు జె.కె. రెడ్డి. సర్వేపల్లి దగ్గర వున్న 500 ఎకరాల బీడును పేదలకిచ్చి తోటల పెంపకం చేపట్టే పథకం అమలు చేయమని కలెక్టరును కోరారు.

కలెక్టరు శ్రీ కె. రాజా సుదీర్ఘ ప్రసంగం చేశారు. ఈ పథకాన్ని, తోటల పెంపకంలోని మెళకువలను ఆయన అప్పుడే ఎంతగా అధ్యయనం చేశారా అనిపించింది.

నెల్లూరు జిల్లాలోని అభ్యుదయ రైతులందరూ ఈ పెంపకం చేపట్టాలని కోరారాయన. ఇందులో సబ్సిడీలు ఏవీ ఇప్పటి వరకు లేవని, సబ్సిడీలపై ఆశతో కాక, ఆదాయం పెంచుకోవడానికి దీన్ని చేపట్టాలని, పెన్నానది, స్వర్ణముఖి నదులకు రెండువైపులా, సముద్రతీరానికి దూరంగా, నీళ్ళు నిలవని పొలాలలోను, నీటివసతి వున్న మెట్ట ప్రాంతాలలోనూ దాదాపు ముప్పై వేల హెక్టారులలో ప్రస్తుతం ఈ తోటలు పెంచవచ్చుని; తెలుగుగంగ పథకం పూర్తయితే మరింత అధిక ప్రాంతం ఇందుకు అనుకూలం అవు తుందని కలెక్టర్ చెప్పారు. సర్వేపల్లి నర్సరీలో వున్న 70 వేల మొక్కలతో తక్షణం వెయ్యి హెక్టారులలో (2500 ఎకరాలు) దీనిని సాగు చేయవచ్చని చెప్పి, హెక్టారుకు కనీసం 60 వేల ఆదాయం వచ్చే అవకాశం వుందని లెక్కగట్టారు. తోటల పెంపకానికి హెక్టారుకు 25 వేల లోన్ ఇప్పించేందుకు బ్యాంకులను ఒప్పిస్తా నన్నారు. అప్పులు, మొక్కలు ఇవ్వడంతో బాటు ఏ సమస్య ఎదురైనా తక్షణం పరి ష్కరించేందుకు ఒక శాస్త్రజ్ఞుల బృందాన్ని రెడీగా పెట్టమని వ్యవసాయ శాఖకు సూచించారు. ఫ్యాక్టరీల స్థాపనపై ప్రభుత్వాన్ని ఒత్తిడి పెట్టకుండా మాగుంట సుబ్బరామిరెడ్డి, జె.కె. రెడ్డిల వంటి వారు పూనుకోవాలని కోరారు.

కొరవ 18 పేజీలో

# వరిలో హైబ్రిడ్‌లు రాకుంటే పెరిగే జనాభాకు తిండి దొరకదు !

డాక్టర్. ఆర్. విజయకుమార్
( హైబ్రిడ్ వరి శాస్త్రవేత్త — మారుటేరు )

గత కొన్ని సంవత్సరాలుగా మొక్కజొన్న పంట అధిక దిగుబడులకు హైబ్రిడ్ మొక్కజొన్న రకాలు ఎంత దోహదకారిగా వుంటున్నాయో అందరికీ తెలిసిన విషయమే. ఈ మొక్కజొన్న పరపరాగ సంపర్క జాతికి చెందింది. ఈ హైబ్రిడ్ మొక్కజొన్న రకములను చూసి ఇతర పంటలలో కూడా అనగా జొన్న, సజ్జ, ప్రత్తి, గోధుమ, బార్లి, పొద్దుతిరుగుడు పువ్వు, మరియు ఆముదం పంటలలో కూడా హైబ్రిడ్ రకాలను తయారు చేసి దిగుబడులను గణనీయంగా పెంచడం జరిగింది. కాని వరిలో ప్రస్తుతము హైబ్రిడ్ రకాలను ప్రపంచములో ఒక్క చైనా దేశములోనే గత పది పన్నెండు సంవత్సరాలుగా విజయవంతంగా పండించుకొంటూ వారి దేశము మొక్క జొన్న దిగుబడులను గణనీయంగా పెంచడం జరిగింది. చైనాలో సగటు దిగుబడి హెక్టారుకు 5.4 టన్నులుండగా, మన భారత దేశంలో మొక్కజొన్న సగటు దిగుబడి హెక్టారు విస్తీర్ణములో 2.2 టన్నులు మాత్రమే ఉన్నది. చైనాలో ప్రస్తుతము ఈ హైబ్రిడ్ రకాలను 15 కోట్ల హెక్టారులలో (48 శాతము వరి పండించే విస్తీర్ణములో ) పండించుచున్నారు. చైనాలో ఈ హైబ్రిడ్ రకాలు, ప్రస్తుతము అధికంగా వ్యాప్తిలో వున్న ఆధునిక రకాల కంటె 20-25 శాతము అధిక దిగుబడులను ఇస్తున్నాయి.

మన దేశములో "డ్వార్ఫింగ్ జీన్"ను ఉపయోగించి ఎన్నో పొట్టి వరి రకాలను తయారు చేసి ధాన్యం ఉత్పత్తులను గణనీయంగా పెంచు కోవడం జరిగింది. కాని ఈ ఆధునిక పొట్టి రకాల దిగుబడి శక్తి 1965 వ సంవత్సరములో తయారు చేసిన 'ఐ.ఆర్. 8' మరియు 'జయ' రకాల కన్నా మించలేదు. మన భారతదేశములో జనాభా రోజురోజుకి విపరీతంగా పెరిగిపోతున్నది. కాని దానికి తగ్గట్టుగా మన వరి దిగుబడులు పెరగటం లేదు. ఇంకొక వైపు వరి పండించే విస్తీర్ణము తగ్గు ముఖం పట్టింది. ఇటువంటి తరుణంలో మనకున్న పరిమితమైన వరి విస్తీర్ణంలోనే అధిక దిగుబడులను సాధించాలి. ఈ నాటి హెచ్చు వరి దిగుబడిని మరింత అధికము చేయాలన్నా ఒక్క హైబ్రిడ్ (సంకరము) రకము ద్వారానే సాధ్యమని శాస్త్రజ్ఞుల దృఢ విశ్వాసము. అందువల్ల ఈ హైబ్రిడ్ల యొక్క ప్రాముఖ్యతను గుర్తించి భారతీయ వ్యవసాయ పరిశోధన మండలి (ఐ.సి.ఎ.ఆర్) వరి, మొక్కజొన్న, జొన్న, కంది, సజ్జ, ప్రొద్దు తిరుగుడు, ఆముదం మరియు ఆవాల పంటల్లో హైబ్రిడ్ రకాలను రూపొందించటానికి కాల పరిమితి గల పథకాన్ని తయారుచేసింది దీన్ని ఉద్యమ స్థాయిలో చేపట్టింది.

ఈ హైబ్రిడ్ వరి పరిశోధనలను విస్తృత పరచుటకై తొమ్మిది పరిశోధనా స్థానాలకు ఐ.సి.ఎ.ఆర్. వారు వచ్చే ఐదు సంవత్సరములకు నిధులు మంజూరు చేశారు. ఈ హైబ్రిడ్ పరిశోధనల నిమిత్తం ట్రైనింగ్, విత్తనముల సరఫరా మరియు సలహా సంప్రదింపులకై ఐ.ఆర్.ఆర్.ఐ. ఫిలిప్పీన్స్ సంస్థతో ఒప్పందము కుదిరింది. ఈ తొమ్మిది సెంటర్లలో నాలు దక్షిణ భారత దేశంలోను (హైదరాబాద్, మారుటేరు, మాండ్యా, కోయంబత్తూర్) మరియు ఐదు ఉత్తర భారత దేశంలోను (కపూర్త, కర్నాల్, పంత్‌నగర్, ఢిల్లీ, కటక్ )ఎన్నుకోబడ్డాయి. ప్రతి సెంటర్లో కూడా ఒక హైబ్రిడ్ వరి శాస్త్రవేత్త నియామకము జరిగింది.

రెండు వేర్వేరు రకములను సంపర్కము చేయగా వచ్చిన మొదటి సంతతి (ఎఫ్ — 1) విత్తనము ద్వారా పండించిన పంటనే హైబ్రిడ్ రకము అంటారు. ఈ హైబ్రిడ్ రకము పంటకు హైబ్రిడ్ విగర్ ( హైబ్రిడ్ శక్తి ) ఉంటుంది. ఇటువంటి శక్తి సాధారణ అధిక దిగుబడుల నిచ్చు రకములకు ఉండదు. ఈ హైబ్రిడ్ రకములను పండించుటకై ప్రతి పంటకు మొదటి సంతతి క్రొత్త విత్తనాన్ని ఎన్నుకొన వలసి ఉంటుంది. ఆధునిక వరి రకములైన ఐ.ఆర్. 64 స్వర్ణ, చైతన్య, వజ్రము, పినాకిని మొదలైన రకాలు హైబ్రిడ్ రకాలు కావు. అందువలన ఈ రకముల యొక్క సాగుకు పంట తదుపరి పంటకు అదే విత్తనాన్ని వాడుకో వచ్చును. ఈ హైబ్రిడ్ రకముల ద్వారా ఈ దిగువ ఉదహరించిన లాభాలు కలవు.

1. ప్రస్తుతము సాగులో వున్న ఆధునిక రకాల కన్న హైబ్రిడ్ రకాలు 15-25 శాతం అధిక దిగుబడినిచ్చును.
2. రోజు వారి దిగుబడి అధికముగా

కొరవ 18 పేజీలో

# జమీన్‌రైతు

## శాంతికి అవకాశం

రక్త పంకిలమైన పంజాబ్ ప్రజా జీవన సరస్సులో శాంతి కలువలను వికసింపచేయడానికి ఎన్నికలు జరుగబోతున్నాయి. ఏకే 47 తుపాకి తూటాలతో [illegible] చేసుకునే తీవ్రవాదులను రాజకీయ వ్యవస్థ నుంచి దూరం చేయడానికి ప్రయత్నం ప్రారంభమైంది. హత్యలతో, రక్తపాతంతో భయానక వాతావరణం సృష్టిస్తూ, పంజాబ్ తమ పిడికిలిలో గువ్వ పిట్ట మాదిరి ఒదిగి వుందని భ్రమ పడుతున్న నరహంతకులకు ప్రజల మద్దతు లేదని నిరూపించే అరుదైన అవకాశం ఈ ఎన్నికలు.

దాదాపు ఒకటిన్నర దశాబ్దం నుంచి పంజాబ్‌లో రక్తం ఏరులై ప్రవహిస్తున్నది. తీవ్రవాదుల ఘాతుకానికి గురికాని ప్రాంతం పంజాబ్ మొత్తం వెతికినా కన్పించదు. ప్రజా ప్రభుత్వంఅన్న మాటనే ఆ ప్రజలు మర్చిపోయారు. గవర్నర్ పాలనే శాశ్వతంగా అమలులో వుంటున్నది. ఎప్పుడు ఎన్నికలు జరిపించాలని ప్రయత్నం చేసినా తీవ్రవాదులు నరమేధం సృష్టించడం ద్వారా వాటిని నిరోధించడం నేర్చుకున్నారు. ప్రభుత్వంపై తమదే పై చేయి అని నిరూపించుకుంటున్నారు. పంజాబ్ ప్రజల మద్దతు తమకుందని ప్రపంచాన్ని నయవంచన చేయజూస్తున్నారు. ఒకసారి ఎన్నికలు జరిగితే ఆ భ్రమలు తొలిగిపోతాయి. రాజకీయ పార్టీలు ఎన్నికలలో గెల్చి ప్రభుత్వం ఏర్పాటు చేయ గల్గితే ప్రజలకు తీవ్రవాదులు దూరమైపోయే అవకాశం చిక్కుతుంది. ఒక్కసారి వారిని నైతికంగా ఓడించి ప్రజా జీవనానికి దూరంగా తరిమి వేయగల్గితే ప్రజలలో వారికున్న పట్టు సడలుతుంది. ఎప్పుడైతే ప్రజాదరణ కోల్పోతారో అప్పుడు తీవ్రవాదం తగ్గుముఖం పడుతుంది. తీవ్రవాదులు — ఒత్తిడి చేసి, భయపెట్టి, తామే ప్రభుత్వాన్ని నడుపుతున్నామన్న అభిప్రాయం కల్పించి, తమతో చేతులు కలపడమంటే శిక్కు మతానికే సేవ చేయడమనే భ్రమలో పెట్టి అపరిమితంగా యువకులను తీవ్రవాదంలోకి లాగుతున్నారు. గ్రామీణప్రాంతాలలోని రైతు కుటుంబీకులను వీరు మాయ చేస్తున్నారు.

ఈ ప్రవాహాన్ని ఆపాలంటే ప్రజలలో ప్రభుత్వం పట్ల విశ్వాసం ఏర్పడాలి. అది సైనికులు, పోలీసులు చేయలేరు. రాజకీయపార్టీల నేతృత్వంలో ప్రజా ప్రభుత్వం ఏర్పడితేనే అది సాధ్యమౌతుంది. అందుకు ఎన్నికలు జరగాలి. తీవ్రవాదులు ఎంతటి మారణహోమం సృష్టించినా చలించకుండా ఎన్నికలు నిర్వహించే స్థిర సంకల్పం కేంద్రానికికల్గాలి ! ఆ చిత్తశుద్ధి లేనందువల్లనే గతంలో ఎన్నికలకు చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. ఈ సారి ఎంతటి రక్తపాతం జరిగినా ఎన్నికలు నిలిపే ప్రసక్తి లేదని ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ప్రకటించారు. స్వతంత్ర అభ్యర్థుల హత్యల ద్వారా ఎన్నికలకు విఘాతం కల్పించే వీలులేకుండా ఆర్డినెన్స్ విడుదల చేసారు. విస్తృతమైన బందోబస్తు చేస్తున్నారు.

అయితే కేవలం ఎన్నికల తేదీలు ప్రకటించి పోలీసులను పహారా తిప్పితే సరిపోదరా. ఎన్నికలలో అకాలీలను భాగస్వామ్యులను చేయడం ప్రభుత్వ కర్తవ్యం. అకాలీలందరూ తీవ్రవాదులు కారు. వారిలో మితవాదులు, మతవాదులు, మధ్యేవాదులు, జాతీయాభిమానం గలవారు వున్నారు. తీవ్రవాదం పట్ల విముఖత కల్గిన అకాలీ నాయకులను ఎన్నికలలో దింపి, అన్ని రాజకీయ పక్షాలూ అటువంటి వారితో పొత్తు కుదుర్చుకొని, ఎన్నికలలో వారు విస్తృతంగా పాలుపంచుకొనే ఏర్పాట్లు చేస్తేనే నిజమైన ప్రజాప్రభుత్వం ఏర్పడుతుంది. ఎన్నికల లక్ష్యం నెరవేరుతుంది. కాంగ్రెస్, కమ్యూనిస్టు, జనతాదళ్ వంటి పార్టీలన్నీ తాత్కాలిక రాజకీయ ప్రయోజనాలను ప్రక్కన పెట్టి శిక్కులలో ప్రభుత్వం పట్ల విశ్వాసం కల్గే రీతిలో ప్రవర్తించడం అవసరం. శిక్కు అభిమానం పొంద లేని ప్రభుత్వం ఎంతో కాలం నిల్వజాలదు. పైగా వారిని కలుపుకోకుండా పోటీ చేస్తే అసలు ఎన్నికలకే మతపరమైన రంగు ఏర్పడుతుంది. దేశం పట్ల, సమైక్యత పట్ల రాజకీయ పార్టీలకు ఏ మాత్రం అభిమానం, చిత్తశుద్ధి వున్నా ఎమ్మెల్యే పదవులకు, మంత్రిత్వాలకు ఆరాటపడకుండా ఈ ఎన్నికలలో అధిక భాగం అకాలీలకు అవకాశం ఇవ్వాలి. దేశ భక్తి కల్గిన అకాలీలతో ప్రభుత్వం ఏర్పాటు చేయగల్గితే పంజాబ్‌లో తీవ్రవాదం, దారితప్పిన ఏ కొద్ది మంది దేశ ద్రోహులకో పరిమితమౌతుంది. పాకిస్తాన్ వంటి దేశాల విచ్ఛినకర కుట్రలు విఫలమౌతాయి. పంజాబ్‌లో ప్రజలు శాంతియుతంగా బ్రతకగల్గుతారు.

## జమీన్‌రైతు

[illegible]

### 8 పేజీలు [illegible]

### నెల్లూరు లూటీలు

హిందూ మహమ్మదీయ మత కలహ కారణంగా రాతి వారివిధి, తుమ్మలవీధుల్లో ఇంకా ప్రతి రాత్రి తలుపులో, ద్వారబంధాలో, ఇంకు సీట్లో ఏదో ఒక అపహరణం జరుగుతూనే వుంది. మొన్న దొరికిన అయ్యగార్లను, మియ్యగార్లను పట్టి చూస్తే ఈ కలహాలకు సంబంధంలేని రోపిడీగాండ్లు గూడా చేస్తున్నారనేది తెలుస్తున్నది. కాని పోయిన వస్తువుల వెత్తా మాత్రం తియ్యడం లేదు. ఏమిటుంది పోలీసు ?

### జమీన్‌రైతు కేసు

గూడూరు ప్రెసిడెంటు లక్ష్మీ నారాయణరెడ్డి గారు జమీన్‌రైతు పత్రికాధిపతిపై వేసిన గూడూరు నుండి మరొక కోర్టుకు మార్చుమని 3 తేదిన జిల్లా కలెక్టర్ వద్ద రామానాయుడు పిటీషన్ పెట్టగా విచారణ నిలుపమని వుత్తర్వు చేసి రికార్డు తనకు పంపమనిరి.

### నెల్లూరు ముచ్చట్లు

బారకాసులో వుండే కేరళ విలాస్ హోటల్‌లో 7 తేది రాత్రి దేవుడి హుండీ ఎత్తుకొని పోయినారు. దీనిలో సుమారు 150 వుంటుంది. దేముడి సొత్తు అపహరించడం దొంగతనం క్రిందకు రాదని బుచ్చిరెడ్డిపాళెపు ధర్మశాస్త్రాలెంత మొత్తుకన్నా పోలీసు రాజ్యం మాత్రం ఆది 379 సెక్షన్ ప్రకారం దొంగతనమేనని, అపహరించినవారు దొంగలని అంటున్నది. [illegible] పోలీసు భయం నెల్లూరులో ఎంత చలామణిలో వుందో [illegible].

### యాహ్యాలిగారు

మన యాహ్యాలిసాహెబ్ గారిని జిల్లా జడ్జి పదవి నుండి [illegible] ట్రిబ్యూనల్ అధ్యక్షులుగా [illegible]

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

నియమించారట. ఇది హిందూ దేశమంతటికీ మహోన్నత పదవి. మనవారు అత్యున్నత దశకు పోయినందుకు మనం కొంచెం పెపు గర్విద్దాం !

### రాపూరు డాక్టర్

రాపూరు అరుగుపెడుతుండగనే డాక్టర్ను గూర్చి గోల్లు మంటుంది. అది నాదారు గ్రామం ; ఏమీ వృత్తులు లేవు. ఇంతకు అంతకు పెదటిక్కని బాధిస్తె ప్రజలు ఎలా తిట్టుకుంటారు ? పారులు అర్జీలు కూడా పెడుతున్నారు. ఎవడు వినేది ? కాని వెంటనే వీరిని గూడూరు వంటి కాకిబంగారం పండే ప్రదేశానికో, లేక కోలారు గోల్డుఫీల్డుల వంటి బంగారం పండే ప్రదేశానికో లేక రవ్వలు రత్నాలు పండే బెల్జియం వంటి [illegible] ప్రదేశానికో పంపి [illegible] డాక్టర్ వారు కూడా మార్చుకుంటారు [illegible].

[illegible] ఈ [illegible] ఇంకా మాత్రం ఆ [illegible] బ్రతకదు.

### రిమార్కులు

వినాయక ఖస్టాండ్ వద్ద నటరాజ లంచ్ హోంలో మున్సిపాలు సాంబారును క్రింద మట్టిలో ఉన్న పాత్రతో ముంచి ఇడ్లీలో పోస్తున్నారు. ఒక థర్డ్ క్లాస్ సర్వెంటు. అప్పుడే మందలించి వచ్చాను. హెల్తు డిపార్టుమెంటు ఎక్కడుందో ?

ఇక్కడ ఒకటి రెండు మూడు కంపెనీలు వక్కపొడి తయారు చేస్తున్నవి. వీరు అశోకవలె ధనవంతులు కావాలని మనం కోరుకోవలసిందే గాని పొక్కు వక్కల పొడి గూడా కలుస్తున్నందున తాంబూలం వేసుకొనే వారిని తల్లక్రిందులు చేస్తున్నదని మాత్రం వారి చెవిని వేయక తప్పదు. ఇకనైనా మేలుకోకుంటే ఇతరకు ప్రాణాపాయం సుమా ! జాగ్రత్త !!!

### కోడూరు నాటకం

కోడూరు హిందూ మహాసభ సహాయార్థం 16 తేది రామదాసు నాటకాన్ని వేస్తున్నారు. పౌరులు సత్కార్యం గాన ఎల్లరు సాయపడి ప్రోత్సహించమని హిందుసభ పెద్దలు కోరుతున్నారు. ఉడతకు ఉడతా భక్తి —

# కృష్ణదేవరాయల కాలంకంటే ముందే పెన్నకు కాలువలుండినాయి !

సర్వేపల్లి చెరువు గురించి డిసెంబరు 20 తేది పత్రికలో వ్రాసిన విషయాలు ఆసక్తికరంగాను, సూటిగాను ఉన్నాయి. సంబంధిత అధికారులకు మంచి చురకగా పని చేస్తుందది. అయితే కొన్ని చారిత్రక, సాంకేతిక విషయాలను చేర్చవలసి వుంది. మీరు వ్రాసినట్లు శ్రీ కృష్ణదేవరాయల కాలంనాటి నుంచి నీటి పారుదల వ్యవస్థ నిర్మాణం ప్రారంభం కాలేదు. అంతకంటె ఎంతో ముందుగానే కావేరి నదితో పాటు, దక్షిణ ఉత్తర పినాకినీల చుట్టూ 'కృత్రిమ నీటిపారుదల వ్యవస్థ' వుండేది. బటర్ వర్త్, వేణుగోపాలశెట్టి ఎడిట్ చేసిన 'నెల్లూరు శాసనాలు'లో మన పెన్నేరు చుట్టు ప్రక్కల, ముఖ్యంగా నెల్లూరు దొన్నవారల సమీపాలలో ఇటువంటి ఏటి కాలువలు వుండేవి. అనేక చెరువులు కూడా వుండినాయి. శ్రీ కృష్ణదేవరాయలు మరి కొన్నిటిని త్రవ్వించి, నీటి పారుదల వ్యవస్థను అప్పటి కనువుగా ఆధునీకరించారు. కల్నల్ ఆర్థర్ థామస్ కాటన్ (1803 - 1899) 1822 నుండి 1862 వరకు చెన్నరాష్ట్రంలో వుండి 1829-1835 లో కావేరి — కలరూనులకు రెండు ఆనకట్టలు కట్టి, 1844-47 మధ్యలో విశాఖపట్నం ప్రధాన కార్యాలయం గావున్న, మొదటి డివిజను సివిల్ ఇంజనీరుగా వుండి ధవళేశ్వరం ఆనకట్ట రూప కల్పన చేశారు. సెకండ్ డివిజన్‌లో చేరినప్పుడు, ఆ తర్వాత సూపరింటెండింగ్ ఇంజనీరు హోదాలో ఆయనకు నెల్లూరుతో ప్రత్యక్ష సంబంధాలు ఏర్పడినాయి. సర్వేపల్లి చెరువును కాటన్ సూచనల మేరకు విస్తృతీకరించుటకై 1867 లో చెన్న రాష్ట్ర ప్రభుత్వం ఒక పెద్ద ప్లాను తయారు చేసింది.

— డాక్టర్. ఎం. అచ్చి రెడ్డి
హైదరాబాద్

### అధికారుల కామోద్రేకం

ఒక ఇంజనీరింగ్ అధికారి కామోద్రేకం గురించి సణుగుదు శీర్షికలో వ్రాసింది మాటికి మూరు పాళ్లు సత్యం. ఒక్క ఇంజనీరింగ్ శాఖే కాదు, పోలీస్, ఎక్సైయిజ్ వంటి ఇతర శాఖలలో సైతం ఆ శీర్షికలో వ్రాసినటువంటి అధికారులు చాలా మంది వున్నారు. వారికి కూడా భార్యలు, సంసారాలు వున్నా వారు లోకానికి చలించరు. ఇదంతా పాలకులైన రాజకీయవాదుల వల్లనే వచ్చింది. దుష్టులు పరిపాలిస్తుంటే దూడ గట్టున మేస్తుందా అనే సామెత కూడా వుంది లోకాన. ఎప్పుడు అనామత్తు దబ్బు

కొరవ 14 పేజీలో

# తియ్యటి చక్కెరలో ఎంతటి చేదు దాగి వుందో ?

ప్రపంచ వ్యాప్తంగా ప్రజలను బాధిస్తున్న దీర్ఘకాలిక తీపి రోగం — డయాబెటిస్. ప్రపంచంలో 12 నుండి 15 కోట్ల మంది ఈ వ్యాధితో బాధపడుతున్నారనిఅంచనా. మన దేశ జనాభాలో 5 నుండి 10 శాతం మంది మధు మేహ వ్యాధిగ్రస్తులున్నారు. డయాబెటిస్ అంటే, రక్తంలో మామూలు పరిమాణం (80 నుండి 140 మి. గ్రా ) కంటె అధికంగా చక్కెర వుండడం. అరెటస్ అనే రోమన్ వైద్య శాస్త్రజ్ఞుడు మొదటగా దీనిని గుర్తించి 'డయాబెటిస్ మెలిటస్ ' అనే పేరు పెట్టాడు.

ప్రతి ఒక్కరి రక్తంలో కొంత పరిమాణంలో చక్కెర వుంటుంది. చక్కెర మన దేహానికి ఇంధనం వంటిది. మనం తినే వరి, గోధుమ, రాగి, జొన్నలు వంటి ఆహార పదార్థాలు 70 శాతం పిండి పదార్థాలు కల్గినవి. ఇవి జీర్ణమైన తర్వాత చక్కెరగా మారుతాయి. అవి రక్తంలో కలిసి ఇంధనంగా పని చేస్తుంది. శరీర అవయవాలన్నింటికి సరిపడే చక్కెరను నిల్వచేసే అవయం —కాలేయం (లివర్) వ్యాయామం చేసినప్పుడు, విరోచనాలు లేదా వాంతులైనప్పుడు, ఇతర అవసరాలలో ఇక్కడ నుంచి శరీరం చక్కెరను తీసుకుంటుంది. ఆ చక్కెర అవసరాన్ని మించి లభ్యమైతే కొవ్వుగా మారిపోతుంది. మధుమేహరోగులలో కొలెస్టరాల్ పరిమాణం పెరగడానికి అదే కారణం.

### పాంక్రియాస్ (PANC REAS)

మనకు షుగర్ వ్యాధి గురించి పూర్తి అవగాహన వుండాలంటే పాంక్రియాస్ గురించి తెలుసు కోవడం చాలా ముఖ్యం. పాంక్రియాస్ గ్రంధి కడుపుకు దిగువుగా వెనకాల వుంటుంది. ఈ పాంక్రియాస్‌లో Islets of Langerhans లోని బీటా సెల్స్ Beta cells ఇన్సులిన్ ఉత్పత్తి చేస్తాయి. ఈ బీటా సెల్స్ మన శరీర అవసరాన్ని బట్టి ఇన్సులిన్ రక్తంలోకి నేరుగా విడుదల చేస్తాయి.

### ఇన్సులిన్ ఎందుకు అవసరం ?

ఆహారం చక్కెరగా మారి శరీర అవసరాలకు ఉపయోగపడాలన్నా లేదా

> **డాక్టర్ అనిల్‌కుమార్ రెడ్డి**
> షుగర్ స్పెషలిస్ట్

కాలేయంలో నిల్వ ఉండాలన్నా ఇన్సులిన్ అవసరం. ఇన్సులిన్ అనుమతి లేనిదే మన శరీరం లోని కణాలు రక్తములోని చక్కెరను (Glucose) ఉపయోగించుకోలేవు.

ఇన్సులిన్ ఉత్పత్తి తక్కువగా వున్న, వుత్పత్తి అయిన ఇన్సులిన్ సరిగా పని చేయకపోయినా మధుమేహానికి దారి తీస్తుంది. అందువల్ల మధుమేహమున్న వారి రక్తంలో చక్కెర ఎక్కువ పరిమాణంలో ఏర్పడుతుంది. ఇలా ఎక్కువైన చక్కెర మూత్ర పిండాల ద్వారా మూత్రంలో విసర్జింపబడుతూ వుంటుంది. అందువల్లే మధుమేహ రోగి ఎక్కువగా మూత్ర విసర్జన చేస్తూ వుంటాడు. ఎక్కువగా మూత్రం విసర్జించుట వల్ల దప్పిక, ఆకలి ఎక్కువవుతాయి.

### ఈ వ్యాధి రెండు రకాలు

#### మొదటిది

చిన్న వయస్సులో వచ్చే చక్కెర వ్యాధి ;వీరిలో పాన్‌క్రియాస్ నుండి ఇన్సులిన్ ఉత్పత్తి చాలా తక్కువవుంటుంది. అందువల్ల వీరికి ఇన్సులిన్ చికిత్స అవసరము.

మరొక రకం 25 సంవత్సరాలు పై బడిన వారిలో కనిపిస్తుంది. వీరిలో ఇన్సులిన్ ఉత్పత్తి వుండవల్సిన దాని కంటె కొంచెం తక్కువగా ఉంటుంది. (RELATIVE LACK OF INSULIN) ఈ రకానికి సాధారణంగా ఇన్సులిన్ అవసరం వుండదు. మన దేశంలో ఈ రకం ఎక్కువగా ఉంది.

### డయాబెటిస్ కారణాలు

**వంశపారంపర్యం :** ఈ వ్యాధి చాలా వరకు వంశపారంపర్యంగా వస్తుంది. తల్లిదండ్రులలో ఒక్కరికి వుంటే పిల్లలకు వచ్చే అవకాశం 40-50 శాతం వరకు ఉంటుంది. తల్లిదండ్రులు ఇద్దరికీ వుంటే పిల్లలకు వచ్చే అవకాశం 90 -100 శాతం వరకు వుంటుంది. శారీరక వ్యాయామం లేకుండుట వల్ల, అధికంగా తినుటవల్ల, మానసిక వత్తిడుల కారణంగా వంశపారంపర్యంగా లావుగా వుండుట వల్ల (Obesity) ఎక్కువ సార్లు

కొరవ 16 పేజీలో







## సణుగుడు

### * పొడుగు కార్లో పోతే రూల్సు పారిపోతాయా ?

పాతరోజుల్లో పల్లెటూళ్ళకు కారులో పోతే పిల్లాపీచు, ముసలీ ముతకతో సహా వింతగా చూసేవారు. చేతితో తాకి మురిసి పోయేవారు. ఆ కారులో తిరిగే వారు ఎంతటి భాగ్యశీలురోకదా అని కళ్ళు పెద్దవి చేసి చూసేవారు. ఈర్ష్యపడేవారు. ఆ కారులో నుంచి దిగేవారిని అపురూపంగా చూచి భయభక్తులు ప్రదర్శించేవారు. పల్లెటూళ్ళలో ఇప్పుడా అమాయకత్వం లేదు. కారును చూచి ఆశ్చర్యపడే వారు లేరు. కాని పల్లె ప్రజలను విడిచిన ఆ అజ్ఞానాంధకారం, ఇప్పుడు ఆంధ్ర రాష్ట్ర రాజధానిలో అలుముకొని వుంది. ఆరు కోట్ల ఆంధ్రులను, పరిపాలించే సెక్రెటేరియట్ భవన సముదాయంలో తిష్టవేసుకొని వుంది. ప్రజల కోసం, ప్రజల సంక్షేమం కోసం, ప్రజలు కట్టే పన్నుల డబ్బుతో కట్టిన ఈ పరిపాలనా భవన సముదాయంలోకి సామాన్య ప్రజలకు ప్రవేశం లేదు. నడిచి, ఆటోలలో ఆ గేటు

**డోలేంద్ర**

ముందు దిగితే మనలోటి వారికి ఎదురయ్యేది అవమానమే. గేటు తలుపు తీయడం మూయడం మాత్రమే పనిగా కలిగిన బడుద్దాయికి నడిచి వచ్చే మనిషిని

కొరవ 14 పేజీలో

## గూడూరు సబార్డినేట్ జడ్జి కోర్టులో

E.P. No. 16/90
Nellore O.S. No. 116/76

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, వెంకటగిరి
Represented by its Branch Manager .. DHr
Vs.
లాలాపేట క్రిష్ణయ్య ... JDr

### ప్రకటన

DHr బాకి రాబట్టు కొనుటకు గాను JDr చెందిన ఈ క్రింది నమోదైన స్థిరాస్తిని పై కోర్టులో 20-1-1992 ఉదయం 10-30గంటల నుండి బహిరంగముగా వేలము జరుపబడును. వేలము పాట పాడదలచిన వారు పాడుకొనచ్చునని యిందు మూలముగా యావన్మందికి తెలియజేయడమైనది.

### ఆస్తి షెడ్యూలు

నెల్లూరు డి. వెంకటగిరి మండలం బొమ్మగుంట గ్రామములో వున్న జె.డి.కి హక్కుగల మాగాణి పొలము వివరములు

| పట్టా నెం. | సర్వే నెం. | విస్తీర్ణము హెక్టార్లు య. సెంట్లు | డి.హో. విలువ రూ | అమినా విలువ రూ |
|---|---|---|---|---|
| 5 | 17/4 | 0.11–0.045 | 550/– | 440/– |
| 41 | 17/7 | 0.75–0.303 | 3750/– | 3000/– |
| 66 | 17/5 | 0.18–0.073 | 900/– | 720/– |
| | 17/6 | 0.22–0.089 | 1100/– | 880/– |
| | 18/6 | 0.05–0.020 | 250/– | 200/– |
| | 18/7 | 0.13–0.052 | 650/– | 520/– |
| | 18/8 | 0.21–0.085 | 1050/– | 840/– |
| | 18/9 | 0.12–0.049 | 600/– | 480/– |
| | 18/10 | 19.0–0.077 | 900/– | 760/– |
| 53 | 17/8 | 0.51–0.206 | 2500/– | 2040/– |

నెల్లూరు జిల్లా వెంకటగిరి మండలం పెట్లూరు గ్రామంలో JDకి హక్కు గల మాగాణి పొలము వివరములు

| పట్టా నెం. | సర్వే నెం. | విస్తీర్ణము హెక్టార్లు య. సెంట్లు | డిహో విలువ | అమినా విలువ |
|---|---|---|---|---|
| 28 | 39/4 | 0.03–0.012 | 360/– | 150/– |
| | 39/2 | 0.09–0.036 | 270/– | 450/– |
| | 72/5 | 0.32–0.129 | 960/– | 1600/– |
| | 72/9 | 0.34–0.137 | 1030/– | 1700/– |
| | 73/11 | 0.17–0.069 | 510/– | 850/– |
| | 73/13 | 0.30–0.121 | 900/– | 1500/– |
| | 57/6 | 0.52–0.210 | 1560/– | 2500/– |
| | 47/1 | 0.12–0.049 | 360/– | 600/– |
| | 34/4 | 0.73–0.295 | 2190/– | 3650/– |

**B. రామదాసు**
DHr అడ్వకేటు

# జిల్లాకు సంబంధించి

## "మ్యాన్ ఆఫ్ ది ఇయర్"

# ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి



'వన్ డబుల్ నైన్ వన్' పోయింది; కొత్త సంవత్సరం వచ్చి కూడా పదిరోజులైనది. దివారాత్రులు, దినాలు, నెలలు, సంవత్సరాల రాకపోకలు కాలక్రమం; కొత్తేమీ కాదు. కాని పోయింది మళ్లీరాదు; 1991 కూడా అంతే; దీనికి పునర్జన్మంటూ లేదు. అయితే రోజుగాని, మాసంగాని, సంవత్సరంగాని తమదైన ముద్రవేసి పోతుంటాయి. వాటిలో కొన్ని మాసిపోయేవి, మరచిపోయేవి; కొన్ని శాశ్వతంగా వుండి చరిత్రలో నిలిచిపోయేవి.

1991లో ఒక్క సంఘటనగా చెప్పుకోవలసివస్తే – ప్రపంచ స్థాయిలో "ప్రపంచ కార్మికులారా ఏకంకండి" అనే నినాదంతో, ప్రజలలో సమసమాజ ఆశలు కొత్త ప్రపంచపు కాంక్షలు కల్గించి సామ్రాజ్యవాద కాపిటలిస్టు వ్యవస్థను భయానకపరచిన సోవియెట్ యూనియన్ అదృశ్యమైపోయింది; పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి మించిన మార్గం లేదని రుజావు చేసింది. మనదేశం విషయానికొస్తే – 1991 సామాన్య ప్రజా సమ్మోహనుడైన రాజీవుని పొట్టన పెట్టుకుంది; దేశ ప్రజలను ఘోరున విలపింపజేసింది. తల్లి తనయులిద్దరూ దేశం కోసం బలికావడమనేది ప్రపంచ చరిత్రలోనే అసాధారణమైన దుఃఖభాజనమైన విషాద సంఘటనేమో ననిపిస్తుంది!

**1991**

**ఒక పరిశీలన**

ఇక్కడ 1991లో జిల్లాకు సంబంధించిన మంచి చెడులను వెనుదిరిగి ఒకసారి అవలోకించ దలచాము.

క్రికెట్ క్రీడకు సంబంధించి "మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్" గా ఒక క్రీడాకారుణ్ణి ప్రకటిస్తుంటారు. అదే విధంగా రాజకీయంగా ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డిని డిక్లేర్ చేయవచ్చు. క్రికెట్‌లో సెంచరీ కొట్టడం ఎంత కీర్తివంతమో, ఆంధ్ర ముఖ్యమంత్రిగా "హర్డిల్ రేసు" అవలీలగా అధిగమించి, సంవత్సరకాలాన్ని విజయవంతంగా పూర్తిచేయడం అంతే గొప్ప విషయం. ఆ ఘనతను ఈ సంవత్సరం జనార్దనరెడ్డికి చేకూర్చింది. హఠాత్పరిణామాలేవైనా ముంచుకొస్తే తప్ప, ఆయన నాయకత్వం సజావుగా 1992లో కూడా సాగిపోతుంది. ముప్పయిఆరేళ్ల ఆంధ్రప్రదేశ్ జీవితంలో ముఖ్యమంత్రి అయిన తొలి నెల్లూరు మండలీయుడు జనార్దన రెడ్డి. రాజకీయ విభేదాలకు, అభిమాన దురభిమానాలకు, దూరంగా జిల్లా ప్రజలందరూ సంతోషించదగిన సంఘటన ఇది.

ముఖ్యమంత్రి అయినందుకు సంతోషపడుదాం; కాని ఆయన జిల్లాకు ఏమి చేశారు? అనేది సర్వత్రా వినబడుతున్న ప్రశ్న. వాస్తవమే – కంటికి కనపడే పెద్దపని, శాశ్వతంగా గుర్తుండిపోయే పని జనార్దన రెడ్డి ఇప్పటివరకు ఏమీ చేయలేదు. మొన్నొక ఎం.పి. అన్నాడు – "జనార్దన రెడ్డి సవాళ్లన్నిటినీ అధిగమించి ఇప్పుడు స్థిమిత పడ్డారు. ఇక ఆయన అభివృద్ధి కార్యాల వైపు దృష్టి సారించాలి" అని చెప్పుకొచ్చారు. వారం రోజుల క్రితం ముఖ్యమంత్రిని ఏదో సందర్భంలో హైదరాబాదులో కలుసుకున్న నెల్లూరు విద్యాధికుడొకరన్నారు –ఇంటా బయట ఒక సమస్య వెంట మరో సమస్య పెద్దపులిలా పైన బడుతుంటే వాటి నుండి తప్పించుకోవడానికి జనార్దన రెడ్డికి వూపిరాడటం లేదు. ఒక వైపు 'రసూల్' వంటి ఆందోళనలు, మరొక వైపు హనుమంతరావు వంటి వారి గొడవ. ఈ చికాకులతోనే వున్న కాలం కాస్త సరిపోతుంటే అభివృద్ధి కార్యాల పట్ల శ్రద్ధ వహించడం ఎవరికైనా మాత్రం ఎట్లా సాధ్యం? అయినా చిక్కులు చికాకులు ఎన్నివున్నా జనార్దన రెడ్డిగారు అవేవీ లేనట్లు మామూలుగా కనబడతారు. ఆయనలోని నిబ్బరం అనితర సాధ్యం" అన్నాడు ఆ విద్యావంతుడు.

సమస్యలు చికాకులు ప్రజలకు కనబడవు. ప్రజల కొలబద్ద – ఏమి జిల్లా నుండి కందుకూరు డివిజన్ వేర్పైన తర్వాత శ్రీ డి.వి. కొండయ్య చౌదరి, శ్రీ కాటూరు నారాయణ స్వామి గారలు మంత్రులయ్యారను కోండి. రాజకీయాల్లో శత్రుత్వాలు, మిత్రత్వాలు శాశ్వతం కాదు అనుటకు జనార్దనరెడ్డి మంత్రివర్గంలో జానకిరాం సభ్యుడు కావడమే తాజా నిదర్శనం. జానకిరాం ఉదయగిరికి శాశ్వతోపకారం ఏదైనా చేయగలగాలి. మాటలు తగ్గించి చేతలు చూపించాలి!

* * *

ముఖ్యమంత్రిగా జనార్దనరెడ్డి గారి పరువు కాపాడినది, ప్రతిష్ఠ పెంచింది, అనుకున్నది సాధించగలడనే పేరు నిలిపినది ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి అభ్యర్థిత్వం, ఆయన విజయం, అట్లనే నెల్లూరు పార్లమెంటు నియోజక వర్గ అభ్యర్థిత్వం విషయంలో తనదే పై చేయి

కొరవ 10-A పేజిలో

# కాంగ్రెస్, తెలుగు దేశాలు కలగా పులగమై పోయాయి !

సహకార ఎన్నికల 'కారు' జిల్లా అంతా దట్టంగా అలముకొని వుంది. నిరవశాయుల కారు కంటే హాటుగా వుంది పరిస్థితి. నామినేషన్ల తతంగం ముగిసింది. దాదాపు 25 శాతం సొసైటీలు ఏకగ్రీవ మైనట్లు వార్తలందుతున్నాయి. ఉపసంహరణలు (11 తేది ) పూర్తయితే తప్ప పరిస్థితి స్పష్టం కాదు. కొన్ని సొసైటీలలో ఒకటి రెండు వార్డులలో మాత్రం పోటీలున్నాయి. కొన్నిటిలో డమ్మీ అభ్యర్థులున్నారు. అధికారుల లెక్క ప్రకారం అవన్నీ పోటీలో వుంటే సొసైటీలే ! ఉపసంహరణల తర్వాత వాటి పరిస్థితి స్పష్టమౌతుంది.

ఈ సారి ఎన్నికలలో ప్రముఖంగా కన్పిస్తున్న పరిణామం — రాజీ ప్రయత్నాలు. ఎక్కడికక్కడ, ఎవరికి వారు రాజీ చేసుకొని ఎన్నిక న్యూసెన్స్ తప్పించుకోవటానికి తంటాలు పడుతున్నారు. ఎన్నికలు జరుగుతాయా లేదా అన్న సందేహం ఇంకా తేలక పోవడం, బ్యాంక్ అభ్యర్థులెవరూ బయటపడి వత్తిడులు తేకపోవడం, రెండు స్త్రీల స్థానాలకు ప్రభుత్వ నామినేషన్లు ఈ రాజీలకు ప్రధాన కారణం. ఎమ్మెల్యేలు, తాలూకా స్థాయి నాయకుల చేతులలో దబ్బులాడక పోవడం కూడా ఒక కారణమేమో తెలియదు మరి.

గత వారమే వ్రాశాం — ఈ ఎన్నికలలో చాలా అపవిత్ర కలయికలు జరుగుతున్నాయని. నల్లపరెడ్డి కుటుంబంలోని కాంగ్రెస్, తెలుగుదేశంల సమాగమాన్ని ఉద్దేశించి చేసిన వ్యాఖ్య అది. కాని ఈ వారంలో పరిస్థితి చూస్తే

**సహకార ఎన్నికలు — తొలి సమీక్ష**

కాంగ్రెస్‌లోని అన్ని గ్రూపులూ ఆ మార్గాన్నే అనుసరిస్తున్నట్లున్నాయి పార్టీ ఎల్లలు చెరిగి పోయాయి.

కాంగ్రెస్‌కు సంబంధించి సమష్టి కృషి కనిపించడం లేదు. డిసిసి అధ్యక్షుల వారు ఎక్కడా ప్రత్యక్ష జోక్యం చేసుకోవడం లేదు. మంత్రి శ్రీ మాదాల జానకిరాం అందరినీ కలిపి ప్రయత్నం చేశారు. కాని అది హాఫ్ మైండ్‌తో చేసినందువల్లనేమో , అరకొరగానే ఫలించింది. ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం వారు మాత్రం తమకు తోచిన రీతిలో సర్దుక పోయారు.

సూళ్లూరు పేటలో 8 సొసైటీలున్నాయి. అందులో ఏడు బ్యాంకుకు అనుబంధమైనవట. వాటిలో నాలుగింటిని తెలుగుదేశం, మూడు కాంగ్రెస్ పంచుకున్నాయి. అన్నీ ఏకగ్రీవం. నాయుడుపేటలో పెంచలయ్య, కృష్ణమూర్తి భాయి భాయి అనుకొని పని చేయడం ఈ ఎన్నికల విశేషం. అన్ని సొసైటీలలోనూ పోటీలు పెట్టారు. వివి కుమార్ రెడ్డి వారిని ప్రతి చోటా ఎదుర్కొంటున్నారు. గూడూరు డివిజన్‌లోని తక్కిన భాగాలన్నిటిలోనూ నల్లపరెడ్డి, వేమారెడ్డిల ముఖాముఖి పోరు జరుగుతున్నది. వేమారెడ్డి రామచంద్రారెడ్డి చింతవరంలో డైరక్టరుగా ఏకగ్రీవంగా ఎన్నికైనాడు. సొసైటీలో మాత్రం పోటీ వుంది. ఏకగ్రీవంగా వచ్చిన సొసైటీల సంఖ్య వేమారెడ్డికే అధికం. కాని పోటీలో వుండే వాటిలో ఆయన ఎంత బలంగా వున్నాడన్నది వేచి చూడాలి ! నల్లపరెడ్డి సోదరులిద్దరూ కూడా ప్రతిష్ఠగా తీసుకొని పోరాడుతున్నారు.

నెల్లూరు డివిజన్ రాజకీయాలో విచిత్రవిచిత్ర మలుపులు తిరుగుతున్నాయి. జక్కంద ప్రధాన భూమిక సిపి. ఆనంలది ! ఇద్దరికీ రాజీచేయాలని డిసిసి నేత ప్రయత్నించినట్లున్నాడు. సోదరులిద్దరికీ "ఆదేశం" కూడా ఇచ్చారట కాని పర్గ అస్తిత్వం పోయే పరిస్థితిలో ఆదేశాలు పనిచేస్తాయా ? అప్పటికీ రామనారాయణరెడ్డి కాదన్నా వివేకానందరెడ్డి సిపి గృహాన్ని పావనం చేసినట్లున్నాడు. అయితే కుశల ప్రశ్నలు తప్ప అసలు సంగతి ఇద్దరూ మాట్లాడుకున్నట్లు లేదు. రాపూరు, సర్వేపల్లిలలో ఆ ఇద్దరు ఎమ్మెల్యేలు చెప్పిన ప్రకారం నడవమని డిసిసి నేత హుకుం అట. రాజీ ఆయన ప్రతిపాదించిన సూత్రం — గత ఎన్నికలలో ఆనం అభ్యర్థులుగా గెలిచి మొన్నటి పద్మశ్రీ ఎన్నికలలో కాంగ్రెస్‌కు చేసిన వారిని మాత్రమే కొనసాగించేటట్లు తక్కినవి ఎమ్మెల్యేలకు ఇచ్చేటట్లు. నీ వేలితో నీ కన్ను పొడుచు కోమన్నాడన్నమాట. ఆనం సోదరులు అంత వెర్రి వెంగళప్పలేమీ కాదు కదా !

¤ కాంగ్రెస్‌లో సమష్టికృషి కన్పించడం లేదు.

¤ ఎవరికి వారు రాజీలు చేసు కుంటున్నారు

¤ ఆశ పడేవారి సంఖ్య పెరిగి పోతూనే వుంది

తరువ 10-B పేజీలో

# నెల్లూరు రచ్చబల్లు

విశ్లేషకుడు

## జీకాం ఎన్నికలు వాయిదా పడ్డాయి

రాష్ట్రంలోని కొన్ని ఎంపిక చేసిన జిల్లాలతో కలిపి, నెల్లూరు జిల్లా కాంగ్రెస్ పిసిసి ఎన్నికలను వాయిదా వేశారు. సభ్యత్వాల నమోదు జరగని కారణంగా పిసిసి వాయిదా వేస్తున్నట్లు పిసిసి ప్రకటించింది.

నెల్లూరు జిల్లాకు సంబంధించి డిసిసి అధ్యక్షుల వారి అశ్రద్ధ వల్ల సభ్యత్వాల నమోదు జరగనే లేదు. మొదట అనుకొన్న ప్రకారం ఎన్నికలు జరిపివుంటే డిసిసి నేతతో సహా పలువురు నాయకులకు కనీసం ఓటు హక్కు సైతం వుండేది కాదు. ఆలస్యంగా ఇచ్చిన జాబితాను హనుమంతరావు తీసుకోక పోవడంతో ముఖ్యమంత్రి ఏకంగా పిసిసి ఎన్నికే రద్దుచేయాలని మరల పేచీ పెట్టారు. దావుకు పెడితే కాని

## కిసాన్ మేళ

వరి పరిశోధనా కేంద్రం ఆధ్వర్యంలో 9,10 తేదులలో 'కిసాన్ మేళా' కన్నుల పండుగగా జరిగింది. వివరాలు పై వారం ముచ్చటించుకుందాం.



విశాఖపట్నం ఇరిగేషన్ శాఖ రిటైర్డు ఛీఫ్ ఇంజనీరు ఎస్.వి.యస్. జి.వి. రామచంద్రరావు, కుమార్తె డాక్టర్ పద్మ ; నెల్లూరు ఇరిగేషన్ రిటైర్డు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పి. రాజగోపాలయ్య కుమారుడు పి.వి.శ్రీనివాసరావు ; వీరి వివాహం డిసెంబరు 11 తేది విశాఖపట్నంలో జరిగింది.

## జిల్లా మంత్రి

శ్రీ మాదాల జానకిరాం జిల్లాలో పర్యటిస్తున్నారు. కార్యక్రమ వివరాలు తెలియవు.

## జి.ప్ర.ప సమావేశం

నెల్లూరు జిల్లా ప్రజా పరిషత్ సమావేశం 9 తేది జరిగింది. విశేషాలు లేవు. నిధులు, విధులు రెండూలేని స్థానిక సంస్థలలో ఉపన్యాసాలు తప్ప విశేషాలు ఏమి వుంటాయి చెప్పండి ?

## పాల సొసైటీలు

అసలు సొసైటీల కంటె పాల సొసైటీ ఎన్నికలు పెద్ద రచ్చగా వున్నాయి. డైరీ యూనియన్ కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ బెజవాడ సురేష్ రెడ్డి ఊరూరు, పల్లెపల్లె తిరుగుతున్నారు. ప్రత్యర్థి శ్రీ గోపాలకృష్ణయ్య చౌదరిలో అంత ఉత్సాహం లేదు. అయినా వదిలి పెట్టడం లేదు. ఇద్దరూ సొసైటీ స్థాయిలో ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

కొరవ 10-A పేజిలో





# సింహావలోకనం

(7 పేజి తరువా)

పోతవలేదే. జిల్లాకు సంబంధించినంత వరకు కృష్ణపట్నం రేవు, నెల్లూరు బైపాస్ రోడ్డు, మెడికల్ కాలేజి, ఈమూడు తన హయాంలో సాధించ గలిగితే చాలు గలిగితే ఆయన ముఖ్యమంత్రిత్వం మ్యాన్ ఆఫ్ ది ఇయర్‌గా కాదు. జిల్లా ప్రజల స్మృతి పథంలో శాశ్వతంగా వుండి పోతుంది.

గత సంవత్సరం మరో ముఖ్యసంఘటన ఉదయగిరీయుడైన శ్రీ మాదాల జానకిరాం మంత్రికావడం. స్వర్గీయ నలమోతు చెంచురామా నాయుడు గారి తర్వాత జిల్లా ఉత్తర ప్రాంతీయుడు, ఒక కమ్మకులస్తుడు మంత్రి అయినవారు శ్రీ మాదాల. నెల్లూరు అని పించుకోవడం, తన అభ్యర్థి కుమారి పద్మశ్రీని గెల్పించుకోగలగడం.

* * *

జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా జిల్లాలో చాలా మందికి పదవులు పంపకం చేశారు. అందులోనూ ఆయన ప్రత్యేకత వుంది. మాటికి మారుపార్టీ తన అనుయాయుడు కాని డాక్టర్ బి. సుందరరామి రెడ్డికి మొట్ట మొదటగా స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ అధ్యక్ష పదవి ఇవ్వడం. అదే విధంగా తన అనుయాయులనుకునే వారిని విస్మరించకపోవడం. స్టేట్ మంత్రిత్వ హోదా గలిగిన ప్రభుత్వ విప్‌ను శ్రీ సి.వి. శేషారెడ్డి కివ్వడం. శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డికి 'బత్తాపొందే అవకాశం తప్ప, అధికారంలేని' ఆర్.టి.ఎ. సభ్యత్వం; శ్రీ జె.కె. రెడ్డికి పబ్లిక్ అండర్ టేకింగ్ కమిటీ ఛైర్మెన్ పదవి అందించడం చెప్పుకోదగినవి. సి.వి.కి, జె.కె.కి ఒకేసారి పదవులిచ్చి, నెల్లూరులో ఒకే సమయంలో స్వాగత సన్మాన సందడి కల్గించడం జనార్దన రెడ్డి చేసిన ఒక తెలివైన పని! అధికార పక్షపాతి, పదవికి అన్ని విధాలా అర్హత గలిగిన శ్రీ సామంతు సుబ్బారెడ్డికి చ్యెర ఫ్యాక్టరి ఛేర్మెన్ పదవి ఇవ్వడం కూడా చెప్పుకో దగింది!

కాని జనార్దనరెడ్డి తనకు అండగా ఎల్లవేళలా విశ్వాసపాత్రంగా వున్న వ్యక్తులు కొందరి విషయంలో అనిర్దయంగా వున్నారు; నానపెస్తున్నారు. ఆయనకు ఏదీ చెప్పవలసిన అవసరం లేదు; గ్రైండరావాలి; అంతే !

* * *

1991లో మరి కొన్ని రాజకీయ విశేషాలు : జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడుగా శ్రీ ఆనం సంజీవరెడ్డి నియామకం; ఆనం యువసోదరులు వివేకానంద రెడ్డి, రామనారాయణరెడ్డి ; డాక్టర్ సి.హెచ్. బాలచెన్నయ్య గారలు కాంగ్రెస్ తీర్థం పుచ్చుకోవడం; ప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శిగా శ్రీ చదలవాడ కృష్ణమూర్తి నియుక్తుడు కావడం; శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి మరుటపాలో కాంగ్రెస్ నుండి తెలుగుదేశంలోకి పోవడం; కోటంరెడ్డి సోదరులు విజయకుమార్ రెడ్డి, శ్రీనివాసులు రెడ్డి ఒకసారి రాజీవ్ విగ్రహప్రతిష్టాపన సందర్భంలో, మరోసారి నాచారం కేసుకు సంబంధించి టౌన్‌లో వీరంగం ప్రదర్శించడం; ట్రంకురోడ్డులో గాంధి విగ్రహాన్ని ఎన్.టి.రామారావు చేత ఆవిష్కరింపజేసి మునిసిపల్ ఛైర్మెన్ శ్రీ టి. రమేష్ రెడ్డి స్వామి భక్తి చాటుకోవడం; "జమీన్ రైతు" వజ్రోత్సవానికి రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్, గవర్నర్ శ్రీ క్రిషన్‌కాంత్ రావడం; మద్రాసు బస్‌స్టాండ్ కూడలిలో రాష్ట్రపతి, తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ విగ్రహాన్ని ఆవిష్కరించడం; బి.జె.పి. అధ్యక్షుడు శ్రీ మురళీమనోహర్ జోషి నెల్లూరు సందర్శనం -- ఇవి 1991లో ముఖ్యమైన రాజకీయ సంఘటనలు.

* * *

ఈ సంవత్సరం తుఫాను బదులు అతివృష్టి వరదలు జిల్లాను ముంచాయి. వందకు మించిన వానలు, నూరుకోట్ల నష్టం ఈ విలయం సృష్టి అసంఖ్యాకంగా చెరువులు తెగాయి. పెన్న పొంగింది, పొర్లు కట్టలను, వాల్వ్‌గైడు పేట్ల గండి పెట్టింది. నెల్లూరు టవున్‌ను జలమయం చేసింది. కాళంగి పాముల కాల్వలు ఏకమై తమ విశ్వరూపాన్ని చూపాయి. ప్రజలకు అత్యంత వుపయోగంగా వుండిన జొన్నవాడ వద్ద పెన్నా మీద వుండిన కామాక్షితాయి వారధి కొట్టుక పోయింది కూడా ఈ సమయంలోనే.

కలెక్టరు శ్రీ రాజా, తక్కుంగల అధికార వర్గం వరదబాధితులను ఆదుకోవడంలో అహోరాత్రులు కృషిచేశారు. వరదల వల్ల నిజంగా ప్రాణాలు కోల్పోయినవారు, ఇళ్లు కూలి పోయినవారు, పైర్లు పంటలు పోగొట్టుకొన్నవారు, నీటిలో రోజుల పర్యంతం మునిగితేలినవారు తప్ప తక్కిన అందరూ వడపప్పు పానకంలా పంపకమైన ప్రభుత్వ సహాయాన్ని పూర్తిగా పొందగలిగారు. హెలికాప్టర్ల నుంచి జారవిడువబడ్డ ఆహారపు పొట్లాలు నీళ్లపాలయ్యాయో, అన్నార్తులకు అందాయో తెలియదుగాని, పొట్లాలు సరఫరా చేసిన కంట్రాక్టర్లు, సహాయం పంచిన వుద్యోగులు బాగా బవురుకున్నారు! అంతే కాదు వరదబాధితుల పేరుతో ప్రభుత్వం మీద దుమ్మెత్తడానికి, రాజకీయ లబ్ధి పొందడానికి ప్రతిపక్షాలకు బ్రహ్మాండమైన అవకాశం కల్గించాయి ఈ వరదలు!

* * *

రాజకీయంగా మ్యాన్ ఆఫ్‌ది ఇయర్ జనార్దనరెడ్డి అయితే, ఉన్నతాధికారుల్లో కలెక్టరు శ్రీ కె. రాజా అటువంటి గౌరవానికి అర్హులు. అక్షరాస్యతా వుద్యమంలోనే కాదు; ప్రజలతో, ప్రజాకార్యక్రమాలతో ఇంతగా లీనమైపోయిన కలెక్టరును ఇటీవల చూడలేదు! శ్రీ రాజా ప్రసన్నవదనుడు, సర్వులకు అందుబాటైన వాడు, సర్వప్రియుడు కూడా. బహుశా మూడేళ్లకు మించి నెల్లూరు కలెక్టరుగా వున్నవాడు రాజాగారే అవుతారేమో!

* * *

మరికొన్ని ముఖ్య సంఘటనలు -- అమెరికన్ అస్పత్రి సూపరింటెండెంట్‌గా నెల్లూరీయులకు అద్వితీయంగా సేవలందించిన త్యాగశీలి డాక్టర్ బేర్, ముప్పయ్ ఏళ్ళ అనంతరం స్వదేశమైన అమెరికాకు తిరిగిపోయింది. నెల్లూరుకు అన్ని ఆధునిక సౌకర్యాలు కల్గిన అపోలో అస్పత్రి వచ్చింది.

నెల్లూరు జిల్లాలో కూడా నక్సలైట్లు కలకేశారు. ఈ విషయాన్ని 'జమీన్ రైతు' 1991 జనవరిలోనే చెప్పింది; మరోసారి "నెల్లూరుకు నక్సలైట్ల వలన - ఉదయగిరి అడవుల్లో బస?" అని హెచ్చరించింది. ఆఖరుకు వారు రాపూరు తాలూకాలో బయట పడనే పడ్డారు.

గౌరవరం వాసి శ్రీ గోనల మాలకొండా రెడ్డి ఆంధ్రబ్యాంకు జనరల్ మేనేజర్ పదవి; విడవలూరీయుడైన శ్రీ పి.వి. నాయుడు, రాష్ట్రపతి పోలీస్ పురస్కారమే గాక, ఐ.జి.పి.గా ప్రమోషన్; మొగలిచర్లకు చెందిన శ్రీ పావని పరమేశ్వర రావుకు సుప్రీం కోర్టు బార్ అసోసియేషన్ అధ్యక్షత ; డాక్టర్ పి. మధుసూదన శాస్త్రికి ఐ.ఎం.ఏ. రాష్ట్ర అధ్యక్ష పదవి; శ్రీ మేనకూరు మోహన్‌రామ రెడ్డికి ఉపలోకాయుక్త పదవి; శ్రీ అన్నదేవుల వెంకురెడ్డి (నెల్లూరు), ఎస్. ఆనందరెడ్డి (గౌరవరం)లకు ఇన్‌కంటాక్సు అప్పిలేట్ ట్రిబ్యునల్ సభ్యత్వాలు, అల్లూరీయుడు పాణకా వెంకట్రామ రెడ్డికి హైకోర్టు న్యాయ మూర్తిత్వం, విద్యానగర్ ఇంజనీరింగ్ కాలేజి ప్రిన్సిపాల్ డాక్టర్ ఐ. గోపాల రెడ్డికి జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ పదవి లభించాయి.

స్వాతంత్ర యోధుడు; జీవితాంతం కాంగ్రెస్‌వాది, సాహిత్య సమారాధకుడు, నెరదాత కీ.శే. తిక్కవరపు రామిరెడ్డి గారి శత జయంతి సందర్భంలో సుప్రసిద్ధ కవి కళాప్రపూర్ణ పద్మశ్రీ. డాక్టర్ బోయి భీమన్న సత్కరింపబడ్డారు.

* * *

1991 జిల్లా జనాభా 23,89,765. ఇందులో పురుషులు 12,06,602 - స్త్రీలు 11,83,163. నెల్లూరు టౌన్ జనాభా 3,16,445; కావలి 65,804; గూడూరు 55,962.

జిల్లా అక్షరాస్యతా శాతం 41.2; ఇందులో పురుషుల శాతం 25.3, స్త్రీల 15.9, నెల్లూరు టౌన్ అక్షరాస్యత శాతం 60.4, కావలి 60.9 గూడూరు 58.2

* * *

ఆఖరుగా విచారకరసంఘటనలు -- స్వాతంత్ర్య సమర వీరులు కె.ఎల్. నారాయణ రావు (నెల్లూరు), పోమవరపు వెంకట రెడ్డి (పొట్టిపాళెం), గుడ్డేటి వీర సుబ్రహ్మణ్యం (గూడూరు) ప్రజోపయోగ కార్యాల నిమిత్త భూరి నిధితో ట్రస్టును ఏర్పాటు చేసిన అరుగుంట దశరథ రామి రెడ్డి; కవి పండితుడు చదలవాడ జయరామశాస్త్రి గారలను 1991 తన తోటి తీసుకపోయింది. ఇరవై రోజుల పాటు సాగిన మునిసిపల్ సిబ్బంది సమ్మె విరమణతో 1991 జిల్లాకు వీడ్కోలు చెప్పి అదృశ్యమైంది!

## నెల్లూరు ముచ్చట్లు

(3 పేజి తరువా)

### వివాహ విందు

శ్రీ నెల్లూరు బాలకృష్ణారెడ్డి కుమారుడు, శైల రాఘవ వివాహం పురస్కరించుకొని గత 23 తేది రాత్రి నెల్లూరు — శ్రీ కస్తూరిబా కళాక్షేత్రంలో 'రిసెప్షన్' అనే విందు జరిగింది.

అబ్బాయి పట్ట భద్రుడు ; అమ్మాయి పోస్టు గ్రాడ్యుయేటు — కేరళ యువతి, తిరువనంతపురం స్టేట్ బ్యాంక్ శాఖలలో ఒకదాని మేనేజర్‌గా వున్న శ్రీ కె. థామస్ కుమార్తె. ఇది లౌ మ్యారేజ్ అన్నమాట. రాష్ట్ర, భాష, కుల, మత హద్దులకు అతీతంగా జరిగే ఇటువంటి వివాహాలు హర్షణీయాలు, అభినందనీయాలు. రాఘవ, శైల జంటకు మా శుభాకాంక్షలు.

### నీటి మట్టం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయర్ | 19.7 అ |
| సర్వేపల్లి " | 6.4 " |
| నెల్లూరు చెరువు | 15.1 " |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు 9672 | రూ.3000/- |
| " 9674 | 3300/- |
| బి.ఆర్ 20 | 2800/- |
| సున్నాలు | 2900/- |
| 5656 | 2500/- |

## సహకార సంఘాలు (9 వ పేజీ తరు.)

పోటీకి సై అన్నారు. రాపూరు ప్రాంతంలో పొదలకూరు రాజ్యాన్ని అంకయ్యగారికి, తమకు మధ్య పంపకాలు పెట్టుకున్నారు. అన్నీ ఏకగ్రీవాలే ! వెంకటరత్నం నాయుడు ఆఖరి నిముషంలో పల్లకొండలో పోటీకి దిగారు. సర్వేపల్లిలో, వెంకటాచలం మండలంలో కొన్ని ఏకగ్రీవాలు లభించాయి. ఇరిమేపల్లిలో శ్రీ వేమారెడ్డి రాజగోపాలరెడ్డి నిర్పోటిగా ఎన్నికైనారు. ఇస్కపాళెం వంటి వాటిలో అయోమయ పరిస్థితి ఏర్పడింది. ముత్తుకూరు ప్రాంతంలోని సొసైటీలకు సి.వి. దేశంల మధ్య ఇంకా రాజీయత్నాలు జరుగుతున్నాయి. ఆయన స్వంత సొసైటీలు — మనమనూరు, పంటపాళెం వీటిలో వున్నాయి.

అందుకూరుపేట కొచ్చేసరికి, రూరల్ బ్యాంకుకు జెకె. సివి పోటీ పడక తప్పలేదు. గునపాటి ఇంట్లో పెద్ద మనిషి పంచాయితీ జరిగినా ఫలించలేదు. ఈదూరు, పిడూరులలో సివి. దేశం సర్దుకపోయినట్లున్నారు. కోదూరుపాడులో వారి ఈ ప్రయత్నం ఎదురుకొట్టింది. జెకె ఏకగ్రీవంగా కొట్టేశారు. పెద్ద చెరుకూరులో చంద్రమోహన్ రెడ్డికి పోటీలేదు. ఎందువల్లనో అది సివి. ఆనంలు ఇద్దరికీ అలివి కాలేదు. (కానట్లు నటించారా ? ) చింతారెడ్డిపాళెంలో ఆనం వివేకానందరెడ్డి ఆఖరు నిముషంలో నామినేషన్ వేశారు. అక్కడా పోటీలేదు. గుండ్లపాళెంలో సివి వియ్యంకుడిని, ఆనం, సిపిఎం కలిసి సవాల్ చేస్తున్నారు. సౌత్ మోపూరు పరిస్థితి అంతే. నరసింహపురంలో ఎప్పుడు ఎట్లా ఓటరుగా చేరారోకాని, వేపూరు దేవకుమార్ రెడ్డి ఎన్నికైనారు. ఇది తెలుగుదేశం కాంగ్రెస్‌ల సంయుక్త రాజకీయమే.

కావలిలో యూనాదిరెడ్డి కత్తికి ఎదురులేదు. 14 సొసైటీలలో ఇంకొకరి ప్రమేయానికి అవకాశం ఇవ్వకుండా తానొక్కడే సమర్థించుకుంటున్నారు ! ఉదయగిరిలో మంత్రిగారిని, రాజమోహన్‌రెడ్డి, విజయరామిరెడ్డి లిద్దరూ కలిసి ఎదుర్కొంటున్నారు. ...ంవి నారాయణరెడ్డికి కూడా పోటీ తప్పలేదు. ఆత్మకూరులో సంజీవరెడ్డి గారు అన్నీ నావేనంటున్నారు. కోవూరులో కాంగ్రెస్ దేశం సమ స్థాయిలో వున్నాయి.

* * *

బ్యాంకు అభ్యర్థులపై ఇప ్పడు ఊహాగానాలు చేయడం తొందర పాటౌతుంది. కాని ఎవరికి వారు తామే అభ్యర్థుల మన్న ధీమాతో వున్నారు. వీరిలో తొలి వ్యక్తి శ్రీ వేమారెడ్డి

### పాఠకులే ! విలేఖరులైతే ?

నిత్యజీవితంలో మనం ఎన్నో సంఘటనలు చూస్తుంటాం. కొన్ని సంఘటనలు, సన్నివేశాలు, దృశ్యాలు మనసుకు హత్తుకుంటాయి. వాటిని తెలిసిన వారికి చెప్పి సంతృప్తి పడుతుంటాం. అయితే అవే సంఘటనలను పత్రికలో ప్రచురిస్తే మరింత ఎక్కువ మందితో అనుభూతి పంచుకోవచ్చు. అందుకే జమీన్‌రైతు పాఠకులకు ఈ ప్రత్యేక అవకాశం కల్పిస్తున్నాం. మీరు చూసే, వార్తగా విలువ వున్నదని భావించే ప్రతి సంఘటననూ, అనుభూతిని మాకు పంపండి. ప్రచురిస్తాం. జరిగింది, జరిగినట్లుగా వ్రాస్తే చాలు — మెరుగులు దిద్ది, వార్తగా మలచుకునే బాధ్యత మాది " మా దృష్టిలో ప్రతి పాఠకుడూ ఒక విలేఖరి క్రిందే లెక్క. పదిమందికి తెలియాలనుకునే ప్రతి విషయమూ వార్త క్రిందే భావిస్తాము.

— సంపాదకుడు

-మచంద్రారెడ్డి. సహజంగా ఆయన ఆశపడితే సిఎం కాదనలేరు. ఈ మధ్య మంత్రి గారు కూడా మామిడి వెళ్లి ఏదో మంతనాలు చేసి వచ్చినట్లున్నారు. కాని, వెంకటరత్నం నాయుడికి సొసైటీకి నామినేషన్ వేయమని మెసేజ్ వచ్చిందని ఒక వదంతి. అది సిఎం నుంచి వచ్చిందో లేక వార్తాహరుడే తన సందేశాన్ని ఫోర్జరీ సిఎం రాజముద్రిక అద్ది విన్పించాడో తెలియదు. ఇంకొక ప్రక్క సాక్షాత్తు సిఎం సోదరుడు శ్రీ పద్మనాభరెడ్డి సొసైటీ అధ్యక్షత పొందుతున్నారు. ఉదయగిరి నారాయణ రెడ్డి మొదటి నుంచి ఈ పదవికి దరఖాస్తుదారుడే ! సిఎంకు సన్నిహితుడుగా చెప్పదగిన దేవకుమార్ రెడ్డి కొత్తగా సహకార రంగంలోకి అరంగేట్రం చేయడమూ బ్యాంకు కోసమే అయితే జాబితా పొడుగవుతుంది. మార్కెటింగ్ సొసైటీతో సరిపెట్టుకొనే ఉద్దేశ్యమైతే వేరే సంగతి ! ఆనం వివేకానంద రెడ్డికి ఆశ వుందో లేదో కాని అవకాశం వుంటుందనుకోలేము. ఇంత మంది హితులు, సన్నిహితులలో సిఎం ఎవరికి గ్రీన్ సిగ్నల్ ఇస్తారో ఎవరు చెప్పగలరు ?

తెలుగుదేశానికి సంబంధించి చంద్రమోహన్ రెడ్డి అభ్యర్థిత్వం ఖాయం. మామ చాటు అల్లుడుగా కాకుండా స్వంత వ్యక్తిత్వం గల్గిన నాయకుడిగా ఎదిగాడు చంద్రమోహన్ రెడ్డి. హేమాహేమి కాంగ్రెస్ నాయకుల గజకర్ణ గోకర్ణ విద్యలను తట్టుకొని, వారందరితో తానొక్కడే ఎదుర్కొని, సమస్థాయిలో పోటీ ఇవ్వగలగడం విశేషమే కదా ! పెట్టకొంచెం, కూత ఘనం అని పూరికి అనలేదు.



















## పినాకినితీరం

(2 పేజి కొరవ )

అవసరంలేదు గాని, దీని తదనంతర పరిణామాలను మాత్రం గమనించవలసి వుంటుంది.

ఒక కుటుంబం పునరేకీకరణ జరిగింది కాబట్టి, ఇతర రాజకీయ కుటుంబాలు కూడా అటువంటి ఆలోచనలో పడుతాయా? అసలు కాంగ్రెస్‌లో ప్రత్యేక వునికి గలిగిన కాంగ్రెస్ కుటుంబాలు ఏమివున్నాయి? ఆనం వారి కుటుంబం వుంటే, ప్రస్తుతానికి అందరూ కాంగ్రెస్‌లోనే వున్నారు. ఈసారి కూడా ఆనం సంజీవరెడ్డి గారే జి.కాం. అధ్యక్షుడుకావచ్చు. ముగ్గురు అన్నదమ్ములు కాంగ్రెస్‌లోనే కొనసాగగలరా? అది సాధ్యమా? తక్కిన ఇద్దరివి సంజీవరెడ్డి కలుపుకొని రాగలరా? పార్టీల కంటె కుటుంబ ప్రతిష్ఠ ముఖ్యం అనే అనుభవానికి వచ్చినమాట ఒకటుంది. అందువల్ల అధికారంతో ముడిపడివున్న రాజకీయాలలో భవిష్యత్ పరిణామాలను ఇంత ముందుగా మనం వూహించలేము.

మేనకూరు వర్గం కాంగ్రెస్‌ను వీడిపోరు; లోపాయికారిగానైనా కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా చేయకపోవచ్చు. శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి కాంగ్రెస్‌లో ఒక ముఖ్యుడుగా వున్నంతకాలం మేనకూరువారు ఆయన్ను కాదనిపోరు. లేకపోయినా మేనకూరు సోదరులకు కాంగ్రెస్‌లోని కొందరు నాయకులు పట్ల విముఖత వుండవచ్చుగాని వాళ్లు ఎప్పుడూ కాంగ్రెస్‌వారులే. పార్టీ ప్రమేయంలేని సొసైటీ ఎన్నికల వంటి వాటిలో వారేకాదు, ఎవరైనా వ్యక్తిగత అభిమాన దురభిమానాలను బట్టి స్వతంత్రంగా వ్యవహరించవచ్చు.

కాంగ్రెస్ కుటుంబాలుగా చెప్పుకోదగినవి మరేమీ లేవుగాని, వ్యక్తులుగా కొందరు ముఖ్యులున్నారు. వారి వైఖరులు ముఖ్యమంత్రి వైఖరి మీద ఆధారపడివుంటాయి. వారిలో అసంతృప్తి జీవులు కొందరైతే, అవకాశాన్ని బట్టి వర్గపరంగా స్వతంత్ర బావుటా ఎగురవేసేవారు కొందరు. జనార్దనరెడ్డిగారు కొంత వుదారంగా, వుదాత్తంగా వ్యవహరిస్తే అసంతృప్తులు వ్యతిరేకతగా పరిణమించే అవకాశం ఇవ్వకుంటే ముఖ్యమంత్రిగా వున్నంత వరకు ఆయన్ను ప్రతికూలించిపోయేవారెవరూ వుండరు. ఒక్క విషయం మాత్రం ఖాయంగా చెప్పవచ్చు. -జనార్దనరెడ్డితో విభేదించినా, నల్లపరెడ్లతో చేతులు కలిపేవారెవరూ లేరు. ఇది నేటి జిల్లాలో కాంగ్రెస్ రాజకీయ చిత్రం.

### జె.కె. కి ఒకమాట

ఇప్పుడు దీన్నిగూర్చి ఎక్కువగా చర్చించదలచుకో లేదు. ఎందువల్లనో ముఖ్యమంత్రి మీద జె.కె.లో అసంతృప్తి చోటు చేసుకున్నట్లుంది. దాని పర్యవసానమేనేమో జె.కె. ప్రకటనలు ఇటీవల దారి మరలుతున్నాయి. ఆయన ఆ దిశలోనే పయనించడం అభిలాషణీయం కాదు. అసంతృప్తికి తగిన కారణాలుండవచ్చు. కాని తొందరపడవద్దని, కాస్త సంయమనం ప్రదర్శించవలసిందని జె.కె.కు నా సలహా. సహనం వల్ల లాభాలే కాని నష్టమేమీ వుండదు.

NVR

## మాదాల

(మొదటి పేజీ కొరవ )

వుంది. దానికి తగినట్లే ఆంతరంగికులలో ఆంతరంగికుడిగా ముఖ్యమంత్రి వద్ద రవీంద్రరెడ్డి మెసలుతుండిన స్థానాన్ని క్రమంగా జానకిరాం ఆక్రమించేసాడు. ఒక వరలో రెండు కత్తులు ఇమడనట్లే, నేత చెవుల్లో గుసగుసలాడే అవకాశం ఒకేసారి ఎప్పుడూ ఇద్దరికి లభించదు. చెవులు కొరకగల్గిన వాడే నేటి రాజకీయ ప్రామాణికత ప్రకారం 'నంబర్ వన్' క్రింద లెక్క. రవీంద్ర రెడ్డికి జానకిరాం 'రాంరాం' చెప్పడంలో ఇదీ ఒక కారణమనుకోవచ్చునేమో!

రవీంద్రరెడ్డి తొందర పాటు స్వభావికాదు. దుడుకుగా మాట్లాడడు. స్నేహపాత్రుడు. ఆ సౌమ్య మనస్తత్వమే ఈ ఘర్షణకు రాజకీయ వివాదపు రంగు ఏర్పడకుండా కాపాడుతున్నది. జానకిరాం, సబ్సిడి బియ్యం విషయంలో తీవ్రంగా ప్రతిస్పందించడానికి కారణం వుంది. ఆ చెన్నారెడ్డి, ఈ పథకం రద్దు ప్రతిపాదన తెస్తే ప్రతిఘటించిన వారిలో ఆయన ప్రథముడు. ఇప్పుడు మంత్రిగా వుండి పథకం రద్దయితే జనం నిల దీస్తా రని భయం. కాని, ఓట్లకోసం, రాజ కీయ వాదుల వ్యక్తిగత ప్రతిష్ఠ కోసం రాష్ట్ర ప్రజలు 800 కోట్ల రూపాయలు కోల్పోతున్నారు ; అసలు దౌర్భాగ్యం అది !

+++





# శివారెడ్డి పద్యాలు

### ఆవేదన

కన్నులోనినాను కూర్చాను పద్యాలు
పలురకాల తెలుగు పాఠకులకు
వీనుగవకు విక్ష విందు గావించాను
కుదురుకొచ్చు నా కలము మూల బిడతా !

ఎన్నోళాల్బలిచ్చు ఎంతెంతో తర్ఫిచ్చు
సత్కరించినావు సభలు జరిపి
నేను నీకు బాకీ నెల్లూరు తిక్కట్టు !
ఎంతగానో, వేంజి ఇంతలోనే

### భోగి పండుగ

ఆ దినాల్లో ముసుపు ఆ పాత రోజుల్లో
దాటి తేగలు దెచ్చి తంపటేసి
పిలిచి యిచ్చువాళ్ళు పెద్దోళ్ళు ఆ రోజా
లింకరావు, తమ్ములిచ్చు చూడు !

### ముఖ్యమంత్రి

కన్నుపొరలు గమ్మి కాంగ్రెసు కవి వీడు
పడుతులెన్ని వుంటె ప్రాయముడిగి
కన్ను మూస్తూ తెరుస్తూ కవిగారు
తనొచ్చి పరకరీదు ముఖ్యమంత్రి కాను

ఈతరాక వచ్చి ఏ రోజో వాక రోజు
బుజము దట్టి కవిని బుజ్జగించి
ఎక్క పొంది నేదురుమల్లి మంత్రివరేణ్య !
అంత పరిశి జాలు అదే పదివేలు

### బి.జె.పి.

బిరర గొట్టుతుంది బిజెపి సభలంట
పద్దినాలు పాటు పత్రికల్లో
అప్పై పారజూప దీన ఫలితమేముంటుంది
వుంతెకొర్ది తోడువారికొకదు

ఎర్రజండ యింత కేమూల దాగిందో
భారతీయ జనతా బ్రతికి వుంది
తెలుగుజండా జాడ తెలియదంటే
పాయ్యేదెమోల్లేదు పోనీంది, వుణ్ణింది

కలతలెక్కువాయె కాంగ్రెస్ పార్టీలో
చాటుమాటు ధర్మసంకటాలు
ఎన్నికలతలున్న ఏమున్న కాంగ్రెసు
గద్దెదిగదు కొర్ది చపలం

### ఏమయింది కన్నా

ఏమయింది కన్నా, ఏమయింది గ్రంథము
పణము దాని కొరకు లేదు దీను
పర్చుకొరకు బోయి ప్రాధేయ పడబోను
ముప్పిచెట్ల బొయ్య ముట్టుకోను

## అపోలో

(7 పేజీ తరువ)

అనే తత్వం ప్రబలంగా కల్గిన ప్రదేశంలో కోట్ల పెట్టుబడితో ఆస్పత్రి నిర్మించటమే ఒక సాహసం. ఆ భవనం, ఆ పరికరాలు లోపలి అలంకరణలు చూస్తే అది ఆస్పత్రిగా కాక, ఫైవ్‌స్టార్ హోటల్‌గా కన్పిస్తుంది. అయితే మద్రాసు అపోలోకు, నెల్లూరు అపోలోకు రేట్ల విషయంలో పోలికే లేదు. ఫైవ్‌స్టార్ హోటల్ గదిని కామన్‌బెడ్‌ల లాడ్జి రేట్లకు ఇచ్చినట్లుంటున్నాయి చార్జీలు. బిల్డింగ్ చూస్తే గుండె పగిలినా, బిల్లు చూస్తే రోగం తిరగబెట్టే పరిస్థితి ఏర్పడకుండా నవ్వుముఖంతో బయటకు పంపుతున్నారు డాక్టర్ గోపాలరెడ్డి.

ఉన్న పరికరాలు గాక, ఈ వారంలో కొత్తగా 5 అధునాతన వైద్య విభాగాలు, వాటికవసరమైన పరికరాలు ప్రారంభించారు. మొదటది "హిమోడయాలైజర్", ఇది అమెరికా నుంచి తెప్పించిన పరికరం. రాయలసీమ మొత్తం మీద, తిరుపతితో సహా, ఇదే మొదటి పరికరం. కిడ్నీ పనిచేయడం మానివేసినప్పుడు ఆ అవయవం చేసే పనులన్నీ ఇది చేస్తుంది. కిడ్నీ రోగులకు ఇది వరప్రసాదం.

రెండవది "ట్రెడ్‌మిల్ టెస్ట్" ఇది అమెరికా యంత్రమే. హృద్రోగుల హృదయ చలనాన్ని కంప్యూటర్ల సహాయంతో వివిధ ఒత్తిడులన కనుగుణంగా, రికార్డు చేస్తుంది. తొలిదశలోనే గుండెపోటును నివారించేందుకు ఉపకరిస్తుంది.

మూడవది — సంపూర్ణ దంతరక్షణ విభాగం. ఇందులో ఒక డెంటల్ లేబరేటరి, ఆర్తో డెంటిస్ట్ సలహాలు లభిస్తాయి. డెంటల్ ఛెయిర్‌ను ఇటలీ నుంచి ఇతర పరికరాలు జపాను నుంచి తెప్పించారు. బంగారు పళ్లు కూడా కడతారట. ఈ విభాగంలో ప్రత్యేక ఆకర్షణ — డాక్టర్ పి. మహేష్ అధిపత్యం. ఎండిఎస్ ప్రోస్థోడాంటిక్స్ పాసైన అటువంటి నిపుణుడు, ఒక్క హైదరాబాదులో తప్ప రాష్ట్రంలో ఇంకెక్కడా లేడట. దంతవైద్యానికి సంబంధించి అత్యుత్తమ చదువు అది.

"పల్మోనరి ఫంక్షన్ టెస్ట్ ట్యూబ్" సైతం ప్రారంభించారు. ఇది జపాన్ పరికరం. మొత్తం కంప్యూటర్ల మయమే. ఊపిరితిత్తులకు సంబంధించి ఆస్త్మా వంటి రోగులకు అత్యంత అధునాతన చికిత్స చేసే వీలు కల్పిస్తుంది.

మద్రాసులో వలె నెల్లూరు అపోలోలోనూ 'మాస్టర్ హెల్త్ చెకప్' సౌకర్యం కల్పించారు. శరీరంలోని ప్రతి అవయవమూ ఎట్లా పని చేస్తున్నాయో పరీక్షించి చెప్పే ప్రక్రియ ఇది. గుండె, లివర్, కిడ్నీ, లంగ్స్ వంటి వాటి పని తీరును ఇందులో సమీక్షిస్తారు. తెలియని రోగాలేమైనా ఉంటే బయటపడతాయి. ఈ కొత్త విభాగలన్నింటినీ 5 తేది ఉదయం ప్రారంభించారు. ఒంగోలు ఎంపి శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ [illegible] రెడ్డి కలెక్టర్ శ్రీ [illegible] ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు.

ఆస్పత్రి మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ గోపాల రెడ్డి ఆ రోజు ఉదయం నెల్లూరు డాక్టర్లందరితో ఒక సమావేశం జరిపించి,వివిధ విభాగాలను చూపించారు.

## పంచాగం

తేది 14 మంగళవారం భోగి

తేది 15 బుధవారం సంక్రాంతి ఉత్తరాయన పుణ్యకాలం మధ్యాహ్నం. గం. 1.45 లోగా పితృ కార్యములు చేయవలెను.

తేది 16 గురువారం కనుమ

తేది 11 శనివారం ఉత్తరాషాఢ కార్తె

### జనవరి నెల తిథులు

పుష్య శుద్ధ :

తేది 11 శని షష్ఠి ప.గం. 2.16 వ
తేది 12 ఆది సప్తమి ప.గం. 2.47 వ
తేది 13 సోమ అష్టమి ప.గం. 2.46 వ
తేది 14 మంగళ నవమి ప.గం. 2.15 వ
తేది 15 బుధ దశమి ప.గం. 1.20 వ
తేది 16 గురు ఏకాదశి ప.గం. 12.00 వ
తేది 17 శుక్ర ద్వాదశి ప.గం. 10.20 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

## సింహపురి

(7 పేజీ తరువాయి)

ప్రార్థించవలసి వచ్చిందో అంత కాలమైంది మొదలు పెట్టి, కాని ఇప్పటికి అందులో పాతిక భాగంకాదు. పదవ వంతు కూడా పని జరగలేదు. ఒకరోజు నాలుగు ట్రక్కులు గ్రావెల్ తోలుతారు, మళ్ళీ పెలరోజులు అంతు వుండరు. మళ్ళీ అదేవిధంగానే తోలుతారు, ఆ విధంగానే అదృశ్యమవుతారు. కొల్తలు, గిల్తలు లేదు. తోలింది పరిచివేస్తారు. మళ్ళీ తోలడం మొదలు పెట్టేసరికి తోలింది కాస్తా మట్టిపాలై పోతుంది. ఇది ఇట్లా వుంటే తాజాగా మరో పరిణామం. అంతా గ్రావెల్ తోలితే వీధి అంటేం చెడి పోతుందనుకున్నారో, లేక గట్టిగా వుండదనుకున్నారో ఏమోగాని గుట్ట మార్చి గుట్ట మట్టితోలుతున్నారు. పల్లెల్లో డొంకలకు కూడా ఇలాంటి మట్టి తోలడంలేదు. అటువంటిది నెల్లూరు మహనగరంలో పట్టపగలు ప్రజల కళ్ళముందే ఈ పని జరుగుతున్నది. మునిసిపల్ పాలన ఎంత మల్కన కానిదే, ఎంత చనువివ్వనిదే, ఎంత అడిగేవారు చూచేవారు లేకపోనిదే మట్టితోలడానికి ఇంత ధైర్యం వస్తుంది? నగుబాటైన విషయం కాదా ఇది? నామోషితో తలవంచుకోవలసిన పని కాదా ఇది? ఫర్లాంగు దూరం గ్రావెల్ వేయడానికే ఇంతకాలం పడితే, ఇక కంకర గింకర వేసి పూర్తి చేయడానికి మరెంత కాలం పడుతుంది? మురుగు కాల్వలు, లైట్లు వేయడానికి మరెంత కాలం పడుతుందో దేవుడికే ఎరుక! మునిసిపల్ అధికార్లు వేతనాలు తీసుకొనే వుద్యోగులే కాదు, ఇక్కడ వున్నంత వరకు నెల్లూరు పౌరులే! అటువంటి వారు తమ అధికారాలను నీరుగార్చుకొని, ఆత్మగౌరవాన్ని చంపుకొని, జరుగుతున్న అన్యాయాలకు ప్రత్యక్ష సాక్షులుగా వుండడం భావ్యంకాదు. ఎంత దిగజారినా తమ వ్యక్తిత్వాలనైనా కాపాడుకోవడం అవసరం.

పన్నుల విధింపు, పన్నులు వసూలు, రావలసిన ఆదాయాన్ని రాబట్టడం అవన్నీ ఏనాడో పోయినట్లున్నాయి. రావలసిన రాబడిని కూడా రాబట్టుకోకుండా జీతాలకు డబ్బులేదని, అభివృద్ధి కార్యాలకు చిల్లిగవ్వ లేదని అంగలారిస్తే ఏమి లాభం? మునిసిపల్ సిబ్బంది ఇరవై రోజులు సమ్మె చేస్తే సానుభూతి చూపిన పౌరులొక్కరైనా వున్నారా? పనిజేస్తున్నా, సమ్మె జేస్తున్నా పరిస్థితి ఒకటే కాబట్టి సమ్మె విషయం ఎవరూ పట్టించుకోలేదు. పరిపాలన రీత్యా కుళ్ళు కంపు గొడుతున్న మునిసిపాలిటీలు దారికి రావాలంటే, బాగుపడాలంటే మూడేళ్లపాటు సరియైన ఐ.ఏ.ఎస్. అధికార్ల చేతిలో పెట్టడం అవసరమనిపిస్తుంది. కాదంటారా?

## జనవాణి

(5 పేజీ తరువాయి)

పోతుందో అప్పుడే బాగుపడుతుంది సమాజం.

— గునుపాటి వేణుగోపాల్
నెల్లూరు

## సణుగుడు

6 పేజీ తరువాయి

మాస్త్రే ఎక్కడలేని చికాకు కనిరుకుంటారు. విసుక్కుంటారు పైనుంచి కరవ వస్తారు. ఆ అరడుగుల పొడుగు, ఆరంగుళాల వెడల్పు సామ్రాజ్యానికి తానే చక్రవర్తిలా ప్రవర్తిస్తారు. అతన్ని తప్పించుకుంటే పోలీసు వారి స్క్రీనింగ్. లోపలికి వచ్చే ప్రతి వాడూ వారి దృష్టిలో తీవ్రవాదులే లేదా దొంగలే. జేబులు తడిమి, బ్యాగులు వెతికి, వళ్ళంతా చేతులు పెట్టి చూడందే వదలరు.

ఎప్పుడంటే అప్పుడు ప్రజలు లోపలకు వెళ్ళకూడదని నియమం. వారు చెప్పిన సమయానికి నిమిషం ముందు కూడా వదలరు. అప్పుడూ, పాసు తీసుకోవాలి. అదొక ఫార్సు. లోపల కూర్చున్న గుమాస్తా మన ముఖం కూడా చూడడు ; ఏమి అడగడు ; చిత్తుకాగితం మీద సంతకం బరికి ఇచ్చేస్తాడు. ఆ కాగితం ముక్క కాపలా పోలీసు దృష్టిలో పాస్‌పోర్ట్‌తో సమానం. గేటు దాటి ఆ నాలుగడుగులూ పోయే వరకు ఇటువంటి నిబంధనలు, నిర్బంధాలు, అడ్డంకులు, చిరాకులు, ఎన్నో చెప్పలేము. అయితే ఇవన్నీ కాలి నడకన వచ్చే మనలాంటి వారికే. కారులో వెళ్తే ఈ రూల్సన్నీ పారిపోతాయి. పొడుగు కారైతే ఇక చెప్పనే అవసరం లేదు.

ఆ కారు చూడగానే గేట్ కీపర్ ప్రక్కకు జరిగి పోతాడు ; పోలీసు సెల్యూట్ కొడతాడు. లోపల వున్నది ఎవరో వీరికి తెలియదు. పెద్దకారులో వచ్చేది పెద్దవారేనన్నది వారి సిద్ధాంతం. లోపల దొంగలుండేది, దొరలుండేది వారి కనవసరం. పెద్ద కారులో వస్తే దొంగైనా దొర క్రిందే లెక్క.

ప్రజలు ఎప్పుడంటే అప్పుడు లోపలికి వస్తే అధికారులు, సిబ్బంది పనిచేసుకోలేరనే ఉద్దేశ్యంతోనే సందర్శన సమయాలు నిర్ణయిస్తారు. కాని, సామాన్యుడు లోపలకు వెళ్తే కలిసేది గుమాస్తాను ; అదీ అతి కష్టం మీద ! ఆ గుమాస్తా అతడితో ఐదు నిముషాలు కూడా మాట్లాడడనేది వాస్తవం. అదే పెద్ద కారులో వచ్చే కాంట్రాక్టర్లు, వ్యాపారస్తులు కలిసేది — సెక్రటరీలను ; గంటల తరబడి వారి గదులలో తిష్టవేయడం వీరికి సరదా ; పని చెడేది వీరి వల్లనే కాని వారినెవరూ అర్థం పెట్టరు. మనం మాత్రం ప్రజాస్వామ్య దేశంలో, ప్రజా ప్రభుత్వాల పాలనలో వున్నామని మురిసి పోతుంటాం. మనల్ని మాని మనసీ జాలిపడాల్సి వచ్చే రోజు ఎంతో దూరంలోలేదు.










# కమల్‌హాసన్ నటనా వైవిధ్యానికి నికషోపలం "గుణ"

కమల్‌హాసన్ నట జీవితంలో ప్రత్యక్షమయ్యే లక్ష్యం ఒక్కటే. అది — ప్రత్యేకమైన పాత్రలో నటించి నట సామ్రాజ్యాన్ని జయించి తీరాలన్నదే ! వెరైటీ పాత్రను సంవత్సరానికి ఒక్కటంటే ఒక్కటి పోషిస్తే చాలు, తన నట జీవితంలో దిగ్విజయాన్ని వెలిక్కించుకున్నట్లు గానే గర్వపడతారు కమల్‌హాసన్. కాని, వెరైటీ పాత్రలను వరుసగా విజయ వంతంగా పోషించడమంటే మాటలతో పని కాదు. అది అందరికీ సాధ్యమయ్యేపనీ కాదు. అలాంటి అసాధ్యమైన పనిని సాధించి, వెరైటీ పాత్రలను లోగుట్టు కున్న దిట్ట కమలహాసన్. దేహ సౌందర్యము, నటనా గాంభీర్యము వున్న కమల్‌హాసన్ను వెరైటీ పాత్రలు ఒకటి వెంట ఒకటి వెంటాడి వరిస్తున్నాయి. ఆ పాత్రల్లోని విజయాలు అతనికి దాసోహమంటున్నాయి.

తాజాగా ''గుణ'' చిత్రంలో ఒక వైవిధ్యమైన పాత్రను పోషించారు. ఈ చిత్రాన్ని మొదట తమిళంలో నిర్మించారు. అదే పేరున యస్.యల్. ఆర్. క్రియేషన్స్ వారు తెలుగులో డబ్ చేశారు. ఇందులో కమల్‌హాసన్ 'గుణ' పాత్రను పోషించారు. ఒక విధంగా చెప్పాలంటే ఇది గ్లామర్‌లేని హీరో పాత్ర. ఇతను వేశ్యవాటికలో పుట్టాడు. అక్షరజ్ఞానం లేని అమాయకపు పాత్ర. మనస్థిమితంలేని ఒక విభిన్న తరహా పాత్ర. గ్లామర్ లేని ఈ పాత్రకు కమల్‌హాసన్ తన నటనతో మనోజ్ఞానాన్ని కూర్చారు. అక్షరజ్ఞానం లేని పాత్రకు ప్రజ్ఞను చేకూర్చారు. అమాయకత్వానికి ధీరత్వం సమకూర్చారు. మన స్థిమితం లేని పాత్రకు సుస్థిరత్వం అమర్చారు. మరి 'విలక్షణ' నటుడు కదాకమల్‌హాసన్ ! గుణ పాత్ర. చిత్రానికి జీవశక్తిగా నిలిచింది. ఈ చిత్రం కమల్‌హాసన్ నటనా వైవిధ్యానికి అద్దం పట్టింది.

**చిత్రసమీక్ష**

****

**గ్రిద్దలూరు గోపాలరావు**

సాబ్‌జాన్ వ్రాసిన ఈ కథ ఒక విషాద ప్రేమ గాథ. గుణ ఏదో ఒక దుర్భర స్థితిలో మనస్థిమితం కోల్పోతాడు. పిచ్చి పిచ్చిగా ప్రవర్తిస్తుంటాడు. ఒక డాక్టర్ (గిరీష్‌కర్నాడ్ ) అతడ్ని మంచి స్థితికి తీసుకొస్తాడు. కాలం తన దారిన వెళ్తూ ఏదో ఒక పెళ్ళి జ్ఞాపకాన్ని గుణ మనసులో వదలి వెళ్తుంది. అందాల రాసి, శ్రీమంతురాలు అయిన రోహిణి (బొంబాయి తార రోహిణి) అనే అమ్మాయిని ఆ వూరి దేవాలయంలో గుణ చూస్తాడు. ఆమెను చూడగానే అతనిలో పెళ్ళి జ్ఞాపకం తళుక్కుమంటుంది. తన ఆశను ఆమె కన్నుల వెన్నెలకాంతుల్లో ప్రతిఫలించుకోవాలనుకుంటాడు. తన ఆవేశాన్ని ఆమె వెచ్చని కౌగిలిలో సేద తీర్చాలనుకుంటాడు. తాను పెళ్ళాడాలనుకున్న ఉమాదేవి ఆమేనన్న నిశ్చయానికొస్తాడు. ఎన్నో కష్టాలను ఎదిరించి, ఆమెను ఎత్తుకపోయి ఒక కొండ ప్రాంతంలో దాస్తాడు. అమ్మాయిని కిడ్నాప్ చేసి హింసిస్తున్నాడని పోలీసులు వెంటాడుతారు. ఆ అమ్మాయిని చంపేసి ఆమె ఆస్తిఅపహరించాలని ఆమె గార్డియను వెంటాడుతాడు. వీరిద్దరి బారి నుంచి తప్పించుకొని ఆమె అంగీకారంతోనే ఆ కొండలోయల్లోనే ఆమెను వివాహమాడుతాడు గుణ. చివరన గార్డియన్ ఆమెను కాల్చి చంపుతాడు. ఆమె శవాన్ని భుజాన వేసుకొని గుణ లోతైన కొండలోయలో దూకి ఆమెతో పరలోకానికి ప్రయాణం సాగిస్తాడు. ఈ నిరాశాదృశ్యం భగ్న హృదయ వేదనకు పరాకాష్ట. దర్శకుడు సంతానభారతి బిగించిన ఈ ముగింపు గుండెల్ని పిండుతుంది. ఇంకా కొన్ని సన్నివేశాలలో దర్శకుడు చీకటి ప్రపంచాన్ని, జీవితపు అగాధాలను, జ్వలించే ప్రేమ స్వరూపాన్ని, ఆరిపోయిన ప్రేమాగ్నిని ప్రతిభావంతంగా చూపాడు.


శౌర్యచక్రలో శోభన

చిత్రం వాలా భాగం కొండకోనల్లో, లోయల్లో సాగుతుంది. ప్రకృతిదృశ్యాలు రమణీయంగా వున్నాయి. ఎత్తైన కొండ చరియనుంచి జారి, చెట్ల ఉపరితలంపై పడి, గుబురు ఆకులను చీల్చుకుంటూ, కొమ్మలను విరుచుకుంటూ, తీగలను తెంచుకుంటూ లోతైన లోయలో "గుణ" పడిన దృశ్యచిత్రీకరణ గొప్పగావుంది. లోతైన లోయల్లోకి సందు చేసుకొని దూసుకొస్తున్న నిడి వైన సూర్యకిరణకాంతుల చిత్రీకరణ చూడతగింది. ఈ రమ్యతను రూపొందించిన వేణు కెమెరాకు సన్మానం చెయ్యాలి.

హిందీ నటి రోహిణి అందం లోను నటనలోను రాణించింది. గిరిష్ కర్నాడ్, బాల సుబ్ర హ్మణ్యం, శరద్ సక్సేనా, జనక రాజ్, ప్రదీప్ శక్తి, రేఖ, యస్. వరలక్ష్మి చక్కగా నటించారు. ఇళయరాజా నేపథ్య సంగీతం చిత్రాన్ని ఉత్తేజ పరిచింది. ★

## ప్రకటన

నెల్లూరు టవును కాపురస్థులున్న మా ... అయిన వెంకటయ్య భార్య ... వెంగమ్మ నెల్లూరు టవును కాపురస్తురాలు మాదాల సుబ్బరామయ్య భార్య మాదాల పెద్దిరామమ్మ (చక్కల రంగయ్య గారి కుమార్తె పెద్ది రామమ్మ) తాలూకు నెల్లూరు టవును ... పేట, లక్ష్మీపురం, డోర్ నెం. 273/B New Door No. 300 గల ఇల్లు ... కొనదలచుకొని విక్రయ అగ్రిమెంటు వ్రాయించుకొని యున్నాది. సదరు విక్రయమునకు సంబంధించి అభ్యంతరాలు ... 15 రోజులలోగా తెలుపు కోవలెను.

S.V. శర్మ
అడ్వకేట్





**In the Court of the District Judge, Nellore**

O.P. No.624/91

(In the matter of the state of the minors 1.Md. Karamthulla 2. Md. Karimulla and 3. Md. Kashifa)

1. Md. Khasin Alin khan alias khasim Basha ... Petitioner

2. Md.Hafeezyunnisa begum

Vs

Md.Mazrulla Respondent

### జనరల్ నోటీసు

ఇందు మూలంగా తెలియజేయడమేమనగా పిటిషనరు పై కోర్టులో, పిటిషను పెద్ద్యాలు ధాఖలా ఆస్తి, నెల్లూరు రూరల్ మండలం అల్లీపురం గ్రామ పంచాయితీ ఏరియాలోని పట్టా నెం. 66 సర్వే నెం. 188 లో య. 2.86 ట్ల భూమిని. 1వ పిటిషనరు విక్రయము చేయుటకు పర్మిషను యివ్వవలశినదిగా కోరుచు పై కోర్టులో పిటిషను దాఖలా చేసి యున్నందున, సదరు పిటిషను నోటీసు కొరకు 25.2.92 తేదిన వాయిదా వేయబడియున్నది. ఇందు విషయమై ఎవరికైనా ఆక్షేపణలు వున్నయెడల ఆ దినం వుదయం 10.30గం. పై కోర్టులో ఖుద్దునగాని, వకీలు ద్వారా గాని హాజరై వారి ఆక్షేపణలు తెలుపకోవలసినది. లేనిచో పరోక్షంగా తీర్మానించబడును.

Md. గౌస్ భాషా
పిటిషనరు తరుపునఅడ్వకేటు, నెల్లూరు

### నెల్లూరు 1వ అ.డి.ము. కోర్టులో

O.S. 850/85

పాలుబోయిన తిరుపాలయ్య ... వాది

1. చెన్నారెడ్డి పిచ్చిరెడ్డి
మరియు 7 వగైరాలు ... ప్రతివాదులు

To

8వ ప్రతివాది
చెన్నారెడ్డి భాగ్యరేఖమ్మ
W/O శేషు రెడ్డి
పూడిపర్తి విలేజి
నెల్లూరు జిల్లా

పై నెంబరున వాది లేటు చెన్నారెడ్డి పిచ్చిరెడ్డి బాకిని రాబట్టుకొనుటకు పై కోర్టులో దావా వేసి ఉన్నందున యిందు విషయమై మీకు నోటీసు నిమిత్తం తే 16.1.1992 దిన వాయిదా యున్నది. ఆ రోజు ఉదయం 10-30 గంటలకు పై కోర్టులో స్వయంగా గాని, లేదా వకీలు ద్వారా గాని హాజరు కావలెను. లేని ఎడల మీ పరోక్షమున దావాను విచారించి తీర్మానము చేయుదురని తెలియజేయడమైనది.

కె. విమల
వాది అడ్వకేటు

# చక్కెర వ్యాధి

(6 వ పేజీ తరువాయి)

[illegible] ... మరియు గర్భ నిరోధక మాత్రలు ఎక్కువ కాలం తీసుకొనుట వల్ల ఈ వ్యాధి వచ్చే అవకాశం వుంది.

### లక్షణాలు

ఈ వ్యాధి చాలా వరకు మొదటి దశలో ఏ లక్షణాలు లేకుండా వుంటుంది. ఏదైనా ఇతర వ్యాధులలో లేదా రొటీన్‌గా చేయించుకునే జనరల్ చెకప్‌లో ఈ వ్యాధి తాలూకు లక్షణాలు తెలియనప్పుడు వ్యాధిని అరమిద్దంగా నిర్ధారించుకోవడానికి ఖాళీ కడుపుతోనూ, తిన్న తర్వాత మరియు గ్లూకోసు టాలరెన్స్ పరీక్ష వంటివి అవసరం. ఈ వ్యాధి ప్రారంభ దశలో తెలుసుకోవాలంటే గ్లూకోసు టాలరెన్స్ పరీక్ష చేయించుకోవడం అవసరం. ప్రారంభ దశలో తెలుసుకోగల్గితే క్రమబద్ధమైన ఆహారం మరియు శారీరక వ్యాయామంతోనూ ఈ వ్యాధిని అరికట్టవచ్చు.

ఎక్కువ మార్లు మూత్ర విసర్జన, అధిక దాహం, ఎక్కువ ఆకలి, ఆహారం తీసుకున్నా బరువు తగ్గుట, పుండ్లు త్వరగా మానకుండుట, అలసట, కళ్ళు తిరుగుట, బలహీనంగా వుండుట, ఎక్కువ దురదలు, ప్రముఖంగా జననాంగాల వద్ద వచ్చే కొన్ని పరాన్నజీవి వ్యాధులు, నడుము, కాళ్ళు, కీళ్ల నొప్పులు, బద్ధకం, ఉషారు కొరవడడం

దృష్టిలోపాలు : తరతరాలు ఈ వ్యాధికి గల ప్రధాన లక్షణాలు

షుగర్ వ్యాధి పేషంట్లలో అనేక రకాలైన ఇతర జబ్బులు వచ్చే అవకాశం ఎక్కువగా వుంది. మామూలు వారి కంటె

షుగర్ వ్యాధి వున్న వారిలో గుండెపోటు వచ్చే అవకాశం రెండు రెట్లు ఎక్కువ. అందువల్ల వీరి రక్తంలో చక్కెర, క్రొవ్వు శాతాన్ని పెరగకుండా చూసుకోవాలి. వీటన్నిటికన్నా క్రమం తప్పకుండా వ్యాయామంచేయాలి పొగత్రాగడం ఖచ్చితంగా మానివేయాలి.

ఈ వ్యాధిలో దీర్ఘకాలిక సమస్యలు ఎక్కువగా ఉంటాయి. కళ్ళు, మూత్రపిండాలు, గుండె, నరములు ఎక్కువగా దెబ్బతింటాయి. అందువల్ల రక్తంలో చక్కెర 160 మి.గ్రా కి మించకుండా ఖచ్చితంగా చూసుకోవాలి.

వ్యాధిని అశ్రద్ధ చేస్తే వచ్చే ప్రమాదాలు

అపస్మారక స్థితి (కోమా) : ఈ వ్యాధి వున్నవారు కోమాలోకి వెళ్లే అవకాశం వుంది. ఇది మామూలుగా 2 రకాలు. మొదటిది రక్తంలో చక్కెర 400 మి.గ్రా. పై పడటం ; రెండవది చక్కెర రక్తంలో 60 మి.గ్రా కన్నా తక్కువగా వుండడం. మొదటి దానిని గురించి ... వివరిస్తాం. దీనిని DIABETIC KETOACIDOSIS అంటారు. ఈ స్థితిలో లక్షణాలు ఈ విధంగా వుంటాయి. ఎక్కువగా దాహం, తడారిన నాలుక, మత్తుగా వుండడం, వాంతులు, పొత్తికడుపు నొప్పి, చర్మం చలిపిరి క్రమ్ముట, తలనొప్పి, తల తిరుగుట, విపరీతమైన నీరసం, ... నొప్పులు ఉంటాయి. ఈ ... వెంటనే ... ఆసుపత్రికి ... ఈ దశలో ... మరణానికి దారి తీయవచ్చు.

రెండవది ఇది మామూలుగా ఇన్సులిన్ సూదులు లేదా మాత్రలు వేసుకొని సరైన వేళలలో ఆహారం తీసుకొనకపోవడం వల్ల, ఇన్సులిన్ మామూలు డోస్ కన్నా ఎక్కువగా తీసుకోవడం వల్ల, అమితంగా వ్యాయామం చేయటం వల్ల రక్తంలోని చక్కెర మామూలు స్థితి కన్నా తగ్గిపోయి కోమాలోకి వెళ్లెఅవకాశం వుంది. దీనిని లో — షుగర్ లేదా హైపోగ్లైసిమియా (HYPOGLYCEMIA) అంటారు. దీనికి చక్కెర, గ్లూకోస్, తేనె, పండ్లరసం ఏదైన తీపి లేదా పిండి పదార్థం వెంటనే తీసుకోవాలి.

లక్షణాలు : చికాకుగా వుండడం, ఎక్కువ చమట, వణుకు, కళ్లు తిరుగుట, తలనొప్పి, మితమీరిన ఆకలి వుంటాయి.

రక్తంలోని చక్కెర శాతం పెరిగితే రక్తం చిక్కగా మారి కొంత కాలం తర్వాత రక్తనాళాలలో ఈ చక్కెర పాకంలాగా పేరుకొని రక్తనాళాల రంధ్రాలను చిన్నగా పూడ్చివేస్తుంది. ఈ మార్పు ముఖ్యంగా మూత్ర పిండాలకు (DIABETIC NEPHROPATHY) కళ్లకు (DIABETIC RETINOPATHY) నరములకు (DIABETIC NEUROPATHY) కళ్లకు మరియు గుండెకు (CARONARY ARTERY THROMOBOS) సంబంధించిన రక్త నాళాలలో సంభవిస్తుంది. వీటి మూలంగా కాళ్ళ వాపులు, కంటి చూపు తగ్గిపోవడం కాళ్ళ తిమ్మిర్లు, అరికాళ్ళ మంటలు, కాళ్ల గాయాలు మానకపోవడం ఆయాసం వంటివి అగుపిస్తాయి. ఒకసారి ఈ మార్పులు జరిగితే తిరిగి యథాస్థితికి రావడం చాలా కష్టం. అందుకునే మధుమేహం వున్నవారు రక్తంలోని చక్కెర శాతాన్ని క్రమం తప్పకుండా పరీక్ష చేసుకుంటూ దాన్ని అదుపులో వుంచుకోవాలి.

ఈ వ్యాధికి సంబంధించి ఆహార నియమాల విషయంలో అనేక రకాల ఊహలు, అపోహలు, భ్రమలు, విభ్రమలు కథలు, కథలుగా అమలులో వున్నాయి. కనుక ఈ రోగంలో పత్యాలకు సంబంధించి, సత్యాలు తెలుసుకోవడం ఎంతో అవసరం. మధుమేహ రోగి గోధుమ, రాగి తప్ప వరి అన్నం తినకూడదనే అభిప్రాయం వుంది. అది తప్పు.

వరి, గోధుమ, రాగి, జొన్న, సజ్జలు తదితరాలన్నీ 70 శాతం పిండి పదార్థం కలిగి వుంటాయి. అందుచేత ఏ ఆహారం అన్నది ముఖ్యమైనది కాదు. ఎంత పరిమాణంలో తీసుకోవాలన్నది ముఖ్యం. వరితో సహా ఏ పదార్థమైనా మితంగా తింటె రక్తంలోని చక్కెర పరిమాణంలో పెద్దగా మార్పు రాదు. ఈ వ్యాధికి సంబంధించి చపాతీలు ఎంత మేలు చేస్తాయో అన్నం కూడా అంతే.

కాకరకాయలు, మెంతులు మొదలగువాని వాడటం వల్ల వ్యాధి తొలి దశలో కొంత గుణం చూపించవచ్చు. కాని ముదిరిన వ్యాధిలో మాత్రం పెద్దగా ఫలితం వుండక పోవచ్చు.

ఈ వ్యాధిచికిత్స విషయంలో రకరకాల మందులు ... అందుబాటులో వున్నాయి. మందులు వాడుతున్నా క్రమం తప్పకుండా రక్త పరీక్షలు చేయించుకుంటే వ్యాధి ఎంత వరకు తగ్గిందో లేదా పెరిగిందో తెలుస్తుంది అంతే కాని మందులు తీసుకుంటున్నామని పరీక్షలు చేయించుకోవడంలో నిర్లక్ష్యం పనికి రాదు.

చాలా మంది ట్రీట్‌మెంట్ మొదలు పెట్టిన తరువాత రక్తంలో గాని, మూత్రంలో గాని చక్కెర నార్మల్‌గా వుంటే జబ్బు తగ్గిందనుకొని మందులు వాడటం మాని వేస్తారు. అది చాలా పొరపాటు. మనం వాడే మాత్రల వల్ల చక్కెర పరిమాణం తగ్గి వుంటుంది. అంతే గాని జబ్బు తానంతట అది తగ్గిపోదు. ప్రారంభదశలో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న వారు రక్తంలోగాని, మూత్రంలోగాని చక్కెర పరిమాణాన్ని ఖాళీ కడుపుతో కన్నా ఉదయాన్నే టిఫిన్ చేసిన 2 గంటల తరువాత పరీక్ష చేసుకుంటే మంచిది. దాని వల్ల మన షుగర్ పరిమాణం ఖచ్చితంగా తెలుస్తుంది. ఈ వ్యాధి రక్తపోటు, ఉబ్బసంలాగా అనువంశిక కోవకు చెందిన వ్యాధి కనుక ఒక మారు వచ్చిన తరువాత దానంతట అదే తగ్గిపోదు.

### జాగ్రత్తలు

క్రమం తప్పకుండా సరియైన వేళలో ఆహారం తీసుకోవాలి. ఉపవాసం, భోజనం మాని వేయుట వంటివి చేయరాదు. నిత్యం విందు ప్రమాదం ; అను నిత్యం "మందు" మరీ ప్రమాదం. బరువు ఎక్కువగా వుండుట మంచిది కాదు. తీపి పదార్థాలు తీసుకొనరాదు. క్రొవ్వుపదార్థాలను ఎక్కువగా వాడరాదు. రక్తము, మూత్రంలోని చక్కెర పరిమాణాన్ని క్రమం తప్పకుండా పరీక్ష చేయించుకోవాలి.

మూడు భోజనాలకు మధ్య స్నాక్స్ తీసుకొనవలెను. ప్రతిరోజు వ్యాయామం అవసరం డాక్టరు సలహా లేకుండా షుగర్ మాత్రలు, ఇన్సులిన్ మధ్యలో మానరాదు.

***

## ‘వెధవలకేం తెలుసు గొప్పతనం’

ఒక వంక మన తెలుగు చిత్రాలు పెద్ద సంఖ్యలోనే తయారవుతున్నాయి అక్కడక్కడ కొన్ని సంఘాలు తీవ్ర నిరసనను తెలియజేసిన కొద్ది కొత్త టైటిల్స్

రామదాసు మరీ ఎంత అధ్వాన్నంగా దిగజారుతున్నాయో మచ్చుకి ఈ కింది పరిశీలించండి.

### ఇదీ టైటిలే

ఎం.ఆర్.సి. మూవీ క్రియేటర్స్ "వెధవలకేం తెలుసు గొప్పతనం" సాయి ఆర్ట్ ఫిలిమ్స్ ఎంటర్‌ప్రైజెస్ "అందరాలో అర్ధాంగి – అమెరికాలో చిత్రాంగి", మైత్రా మూవీస్ "చింతామణి సొంత మొగుడు" సింధు సినీ క్రియేషన్స్ "అల్లుడుగారు – అపార్థమాసం" శ్రీదేవి కళామందిర్ "అల్లుడా అల్లుడా అమ్మాయిమొగుడా" సంగమూరి క్రియేషన్స్ "అల్లరి అమ్మాయి – గడుసరి అబ్బాయి", లక్ష్మిరాజా కమర్షియల్స్ "ప్రైవేట్ గూండా" శ్రీ దత్తసాయి క్రియేషన్స్ "రౌడీ రాజ్యం". నేషనల్ పిక్చర్స్ "రణమొండి". అనూరాధ మూవీ క్రియేషన్స్ "ఫైనల్ వార్నింగ్". సమీర్ ఎంటర్ ప్రైజెస్ "రౌడీ మామ". సౌభాగ్యమూవీస్ "పబ్లిక్ గూండా". ఎస్.ఎస్. ఫిలిమ్స్ "దొంగోడు".

## ‘నేనుండీ దండగ, క్షమించండి’

రాష్ట్ర చలన చిత్ర సంస్థ అధ్యక్షుడు మల్లెమాల సుందర రామిరెడ్డి సర్వ సమర్థుడు ధీశాలి. అయినప్పటికీ ఆయన జలేవల వెలిబుచ్చిన విష యాలు గమ నార్హం. "ప్రభుత్వ రంగం వలు రాయితీలు కల్పించవలసి ఉన్నప్పటికీ అధికారుల జాప్యం మూలంగా ఎటువంటి సహాయాన్ని అందించలేక పోతున్నందుకు ఎంతో బాధగా వుంది. ప్రభుత్వ నిబంధనల మూలంగా నేనేమీ చేయలేక అంతర్గతంగా ఎంతో వ్యధ చెందు తున్నాను. నా పరిస్థితిని అర్థం చేసుకోగలరనుకుంటాను. అన్నారాయన. నిర్మాతలే కాక సంస్థలో సభ్యులైన ప్రదర్శకులు పంపిణీదారులు సైతం సమైక్యంగా కృషి చేస్తేనే సమస్యలను పరిష్కరించి, చిత్రరంగ పరిస్థితిని మెరుగు పరచడానికి వీలవుతుంది. ఇందుకు అయా రంగాలలోని ప్రముఖులలో ఒక ప్రత్యేక బోర్డును ప్రభుత్వం ఏర్పాటు చేయవలసిన అవసరం ఎంతో ఉంది.

### ఎమ్మెస్ రెడ్డి మనోవ్యధ

### జర్నలిస్ట్ రచనతో "తెగింపు" యదార్థగాథ

"ఇండియన్ ఎక్స్‌ప్రెస్" లో 10 సంవత్సరములు పని చేసి ప్రస్తుతం ఢిల్లీలో "రాయిటర్స్" కరస్పాండెంటుగా పని చేస్తున్న గుంటూరు వాస్తవ్యుడు

దేవవరం ఒక యదార్థగాధ ఆధారంగా రచించిన "తెగింపు" కథను నెల్లూరీయుడు పి.యస్. రామచంద్రరావు దర్శకత్వంలో హెచ్. ఎమ్. రెడ్డి నిర్మిస్తున్నారు. జేమ్స్ బాండ్ పాత్ర

సృష్టించిన అయాన్ ఫ్లెమింగ్ "ది ఆఫ్ ది జాకాల్" సినిమా కథ వ్రాసిన ఫ్రెడరిక్ ఫోర్‌సైత్ ప్రభృతులు 120 సంవత్సరాలుగా ప్రపంచ ఖ్యాతి పొందిన రాయిటర్స్ న్యూస్ ఏజెన్సీలో పని చేసిన వారే.

## దివ్యవాణికి బంగారు భవిష్యత్తు

రాష్ట్ర ప్రభుత్వం కల్పించిన మూడు లక్షల సబ్సిడీ, వినోదపు పన్నులో రాయితీల మూలంగా తెలుగు చిత్రాలన్నీ మన రాష్ట్రంలోనే నిర్మించాల్సిన అవసరం ఏర్పడింది. ఈ నేపథ్యంలో పలువురు కొత్త నిర్మాతలు, దర్శకులు, తారలు, సాంకేతిక నిపుణులు రంగంలో ప్రవేశించారు. డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు నట జీవిత స్వర్ణోత్సవంలో ఆయనకు 'దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు' ఘన కీర్తి తెగా. "సీతారామయ్యగారి మనమరాలు" గొప్ప విజయం సాధించింది. డాక్టర్ యన్.టి. రామారావు రంగుల కల "బ్రహ్మర్షి విశ్వామిత్ర" పటాపంచలైంది. చిరంజీవి చిత్రాలలో "గాంగ్ లీడర్, రౌడీ అల్లుడు" సూపర్ హిట్స్ అయ్యాయి. మోహన్‌బాబు "అసెంబ్లీ రౌడీ, రౌడీగారి పెళ్లాం" ఘన విజయాన్ని సాధించాయి. 9 చిత్రాలలో నటించిన నరేష్ కు "చిత్రం భళారే విచిత్రం" మాత్రం మంచి పేరును తెచ్చి

### 1991 సింహావలోకనం

పెట్టింది. బాలకృష్ణ నటించిన 3 చిత్రాలలో "ఆదిత్య 369" మాత్రమే చెప్పుకోదగ్గది. నాగార్జున నాలుగు చిత్రాలలో "నిర్ణయం" ఒక్కటే కాస్త మెరుగు. వెంకటేష్ నటించిన "శత్రువు, కూలీ నెం. 1" హిట్స్ అయ్యాయి. సుమన్ "పెద్దింటల్లుడు" రాజశేఖర్ "ఆగ్రహం" హిట్స్ అయ్యాయి. అందరి కన్నా ఎక్కువగా 11 చిత్రాలలో నటించిన రాజేంద్రప్రసాద్ హిట్లన్నీ "ఏప్రిల్ 1 విడుదల, పెళ్ళి పుస్తకం, ఇద్దరు పెళ్లాల ముద్దుల పోలీసు, ఎదురింటి మొగుడు పక్కింటి పెళ్ళాం" హిట్స్ అయ్యాయి. వినోద్ కుమార్ నటించిన ఆరు చిత్రాలలో "మామగారు, భారత్ బంద్, పీపుల్స్ ఎన్‌కౌంటర్" హిట్స్ అయ్యాయి. హరీష్ "ప్రేమఖైదీ" తెలుగుతో పాటు హిందీ వెర్షన్‌లోనూ నటించి అదృష్టవంతుడుని

కొరవ 18 పేజీలో

## బుచ్చి రత్నం దర్శకుడుగా మారాడు

"కర్తవ్యం" చిత్ర నిర్మాతగా సంచలనం సృష్టించిన ఎ.ఎం. రత్నం అసలు దర్శకుడవ్వాలనే ఉద్దేశ్యంతోనే బుచ్చిరెడ్డిపాళెం నుంచి మద్రాసుకు బయలుదేరాడు 20 సంవత్సరాల క్రితం. కాని, పరిస్థితుల ప్రభావం వల్ల మేకప్ శాఖలో చేరి, దాదాపు 250 చిత్రాలకు పని చేశాడు. అయినా, వివిధ దర్శకుల పనితనాన్ని పరిశీలిస్తూనే వచ్చాడు. ఇప్పుడు సూర్యచిత్ర బానర్‌లో ఆయన

నిర్మాత. దర్శకత్వం వహించే చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 20 నుంచి నెల రోజుల పాటు నిరవధికంగా ఊటీలో జరుగుతుంది. జగపతిబాబు, చంద్రమోహన్, సుధాకర్, రామిరెడ్డి, నిళల్‌గళ్ రవి, అల్లు రామలింగయ్య, నర్రా వెంకటేశ్వరరావు, బాలయ్య, చలపతిరావు, విజయకుమార్, చలపాటి కృష్ణారావుతో పాటు కొత్త నటీమణులు పాల్గొంటారు. రచన పరుచూరి బ్రదర్స్, కెమెరా ఎస్. గోపాలరెడ్డి, నిర్వహణ అళగిరి రఘురాం.

### నెల్లూరు దర్శకునితో నెల్లూరు నిర్మాత చిత్రం

"ఖైదీ, వేట, మహాసంగ్రామం" చిత్రాల భాగస్వామి పి. శ్రీధర్ రెడ్డి మార్చి నుండి నిర్మించే శ్రీ సాయిజ్యోతి ఫిలిమ్స్ చిత్రంలో మోహన్‌బాబు హీరో, స్క్రీన్‌ప్లే దర్శకత్వం. ఎ. కోదండరామిరెడ్డి.



నెల్లూరు రోటరాక్ట్ క్లబ్ నిర్వహించిన శిశు సౌందర్య పోటీలో విజేతలు కార్తిక్, క్రాంతిలకు కిరీటాలలంకరింపజేస్తున్న కలెక్టర్ సతీమణి కె. సుజాతా రాజు, జాయింట్ కలెక్టర్ సతీమణి రమాసాంబశివరావు ; ప్రక్కన అయ్యప్ప దుస్తులలో వున్నది. రోటరాక్ట్ క్లబ్ అధ్యక్షుడు దగ్గుబాటి శ్రీధర్

# సింహావలోకనం

(17 పేజీ తరువ )

పెంచుకున్నారు. కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజు, భానుచందర్, సురేష్, నాగేంద్రబాబు, జగపతిబాబు, శరత్‌బాబు, రమేష్, మురళీమోహన్ నటించిన చిత్రాలన్నీ అపజయం పొందాయి. చంద్రమోహన్‌కు "కలికాలం" ఉత్సాహమిచ్చింది.

"కర్తవ్యం" వంటి సూపర్ హిట్ చిత్రం అందించిన విజయశాంతి జాతీయస్థాయిలో ఉత్తమ నటిగా ఎన్నికైంది. మరోసారి రాష్ట్ర ప్రభుత్వపు నంది అవార్డు అందుకుంది. "గ్యాంగ్ లీడర్, శత్రువు "ఆమె ప్రతిష్ఠను పెంచాయి. అందరికన్నా ఎక్కువ చిత్రాలలో పాల్గొన్న శోభనకు "రౌడీగారి పెళ్ళాం, రౌడీ అల్లుడు" హిట్స్ అయ్యాయి. "పెళ్ళి పుస్తకం, ఇద్దరు పెళ్ళాల ముద్దుల పోలీస్ , ఎదురింటి మొగుడు – పక్కింటి పెళ్ళాం " హిట్స్ అవడంతో దివ్యవాణి భవిష్యత్తుకు బంగారు బాట వేసుకుంది. దివ్యభారతి, భానుప్రియ, యమున, సితార, లిజి, రోజా, నగ్మాల కన్నా మిన్నగా మీనా ప్రేక్షకులలో క్రేజ్ పెంచుకుంది. జయసుధకు "కలికాలం " ఊర్వశి శారదకు "ప్రేమఖైదీ", అమలకు "ఆగ్రహం" పేరు తెచ్చి పెట్టాయి. వివాహం చేసుకుని సినిమా జీవితానికి స్వస్తి చెప్పిన రాధ నటించిన నాలుగు చిత్రాలూ అంతంత మాత్రమే.

అశ్వని నాచప్ప, రూపాగంగూలి (నా ఇల్లే నా స్వర్గం ), నగ్మా, స్వాతి, మోహిని, చిత్రా, అమృత, అంజలి, బిందియా, అనూష, రూపకళ, మయూరి, వందన, రాజీవి, కావేరి, మధుబాల, హేమమాధుర్, గాయత్రి, మానస, మధురిమ, వగైరా నటీమణులు, శ్రీనివాస వర్మ, అజయ్, సంజయ్‌మిత్ర ప్రభృత నటులు పరిచయం గావింపబడ్డారు.

ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యానికి 1991 రజతోత్సవ సంవత్సరం

## విభిన్నమైన పాత్రల్లో వాణిశ్రీ

ఎంత క్లిష్టమైన పాత్ర అయినా వాణిశ్రీకి కొట్టిన పిండి అన్న విషయం అందరూ ఎరిగినదే. పి.యస్. రామచంద్రరావు దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మించే చిత్రంలో ఆదర్శ గృహిణిగా నటించే ఈమె సీతారత్నం గారి అబ్బాయి చిత్రంలో సర్దుకుపోలేని మనస్తత్వం గల స్త్రీగా, శ్రీ వెంకటకృష్ణా ఫిలిమ్స్ చిత్రంలో హోమ్ మినిస్టర్‌గా, వి.యస్. ఆర్ట్స్ చిత్రంలో సైకాలజీ ప్రొఫెసరుగా నటిస్తుంది.

## సంక్రాంతి కానుకలు

నాగార్జున "కిల్లర్ ", వెంకటేష్ "చంటి ", బాలకృష్ణ " ధర్మక్షేత్రం " , రాజేంద్రప్రసాద్ " అప్పుల అప్పారావు " చిత్రాలు సంక్రాంతికి విడుదలవుతున్నాయి. ఈ మారు సంక్రాంతికి చిరంజీవి చిత్రమేదీ లేదు.

## రద్దయిన బెంగుళూరు చిత్రోత్సవం

మన దేశంలో ప్రతి ఏటా వివిధ నగరాలలో జరిగే అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఈ ఏడు జనవరి 10 న బెంగుళూరులో ప్రారంభం కావలసి ఉంది. కావేరి జలాల వివాదం వల్ల కర్నాటకలో ఏర్పడిన ఉద్రిక్త వాతావరణం దృష్ట్యా బెంగుళూరులో నిర్వహించడం అసాధ్యమని తేలిపోయింది. తమిళులపైన జరిగిన దౌర్జన్యానికి నిరసనగా తమిళ చిత్ర పరిశ్రమకు చెందిన వారెవరూ హాజరుకావడం లేదని ప్రకటించేసరికి డాక్టర్. రాజకుమార్ నాయకత్వంలో అక్కడి కన్నడ చిత్ర ప్రముఖులు కూడా పాల్గొనడం లేదని ప్రకటించారు. ఏర్పాట్లకు ఇప్పటికే కొన్ని లక్షల వ్యయమైంది.

## నెల్లూరీయుని చిత్రం "దొంగలున్నారు జాగ్రత్త "

నెల్లూరీయుడు సత్యారెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించే పై చిత్రంలో, నిర్మాత రాజా, గిరిబాబు పుత్రుడు రఘు, వెంకట్, జాకీ, నాగరాజ్, సాయికిరణ్ హీరోలు. మాటలు. సాయినాథ్, సంగీతం. నవీన్‌జ్యోతి, కెమెరా. అజయ్, కళ. రంగారావు. ఈ విశిష్టమైన చిత్రంలో ఇంకా రావుగోపాలరావు, బ్రహ్మానందం, గిరిబాబు, బాబుమోహన్, అచ్యుత్, కెప్టెన్ రాజు, జయదేవ్, జయప్రకాశ్, మాడా, కావేరి, సిల్కుస్మిత, అన్నపూర్ణ ఆదిగా కలవారు కూడా పాల్గొంటున్నారు. జనవరి పది నుంచి ఊటి, తిరుపతి, హైదరాబాద్ ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది.

## హైబ్రిడ్

(4 పేజీ తరువ )

వుండును. 3. వివిధ వాతావరణములకు కూడా బాగా తట్టుకోగలవు. 4. ఎరువులను ఎక్కువ సమర్థవంతంగా ఉపయోగించుకొనగలవు. 5. హైబ్రిడ్ రకములు చీడ పీడలను కూడా బాగా తట్టుకొనగలవు.

హైబ్రిడ్ వరి రకాలను రూపొందించాలంటే మూడు ప్రత్యేక లక్షణాలు గల రకములు అవసరము. అవి 1 పుంసత్వము లేని వరి రకము (మేల్ స్టెరైలు లైను అనే 'ఏ' లైను ) 2. మెయింటేనర్ రకము ('బి' లైను ) 3. ఫలదీకరణము చేయు రకము ( రెస్టోరర్ లేక 'ఆర్ ' లైను )

పుంసత్వము లేని వరి రకములు పూర్తిగా స్త్రీ లింగ గుణములు గల రకములు. వీటిలో అండాశయము మాత్రమే పని చేస్తుంది. పుప్పొడిలో జీవశక్తి వుండదు. ఈ రకము మొక్కలలో గింజ తొడగడానికి తప్పని సరిగా పరపరాగ సంపర్కము జరుగవలయును.

పుంసత్వము లేని రకములను పునరుత్పత్తి చేయడానికి తోడ్పడు రకములను మెయింటేనర్ లైను అని అంటారు.

ఫలదీకరణము చేయు రకములకు ('ఆర్ లైను ) కొన్ని ప్రత్యేక జన్యు లక్షణములను కలిగి వుంటాయి. అందువలన 'ఆర్' లైనును 'ఏ' లైను మొక్కల ప్రక్కన నాటితే పరపరాగ సంపర్కము జరిగి పుంసత్వము లేని మొక్కలపై గింజలు తయారగును. ఈ గింజలనే మొదటి తరం సంకరపు (హైబ్రిడ్ ) విత్తనము అని అందురు.

హైబ్రిడ్ వరి విత్తనోత్పత్తిని గూర్చి వివరణ ఈసారి వారం చదవండి.

## పామ్ ఆయిల్

(4 పేజీ తరువ )

సదస్సులో దాదాపు వంద మంది రైతులు పాల్గొన్నారు. దాదాపు మూడు గంటల సేపు ప్రశ్నోత్తరాల కార్యక్రమం నడిచింది.

సదస్సు ప్రారంభంలో చక్కటి వీడియో ఫిలిమ్ ప్రదర్శించారు. నేల ఎంపిక నుంచి, పెరిగిన చెట్ల నుంచి కాయలు కోయడం వరకు సవివరంగా చూపారు. రైతులలోని ఆసక్తిని, అధికారులు చెప్పే ఆదాయపు లెక్కలను చూస్తే జిల్లాలో రెండుమూడేళ్ళకు ఎక్కడకు వెళ్ళినా పామ్ ఆయిల్ తోటలే కన్పిస్తాయేమోననిపిస్తుంది.

# సింహపురిలో అపోలో అపూర్వ వైద్యసేవలు




దేశంలో అత్యంత ఆధునికమైన హాస్పిటల్స్‌కు నాంది పలికిన సునత అపోలో హాస్పిటల్స్‌కు దక్కిందని ఆ హాస్పిటల్స్ ఛైర్మన్, పద్మవిభూషణ్ డాక్టర్ ప్రతాప్ సి. రెడ్డి అన్నారు. నెల్లూరులో అపోలో హాస్పిటల్ ప్రారంభోత్సవం సందర్భంగా ఆయనను కలుసుకున్న మా ప్రత్యేక ప్రతినిధికి ఆయన క్లుప్తంగా తమ అభిప్రాయాలను తెలిపారు. వైద్యశాలల నిర్వహణలో మేము చూపిన చొరవ, ప్రతిభలవల్ల ఎన్నో ఆధునికమైన వైద్యశాలలు పుట్టుకొచ్చాయన్నారు. ఆరోగ్య పరిరక్షణలో అధునాతనమైన పద్ధతులను ఆవిష్కరించిన మా హాస్పిటల్స్‌ఇంతవరకు నగరాలకే పరిమితమయ్యాని తెలిపారు ఇప్పుడు నెల్లూరు పట్టణంలో కార్పొరేట్ సెక్టార్‌లో ఈ స్థాయి హాస్పిటల్ ఏర్పాటు దేశంలోనే మొట్టమొదటిదని చెప్పారు. మద్రాసు, హైదరాబాద్ నగరాలలోని అపోలో హాస్పిటల్స్ అనూహ్యమైన ప్రగతిని సాధించి, వైద్యరంగంలో ఒక కొత్త ఒరవడిని సృష్టించాయన్నారు. అత్యుత్తమ వైద్యసేవలను అందించడంలో చక్కని ఉదాహరణగా నిలిచాయని తెలిపారు. ప్రతిభావంతులైన ఇండియన్ హాస్పిటల్ కార్పొరేషన్ వారు అందిస్తున్న సహాయ సహకారాల వల్ల నెల్లూరులోని అపోలో హాస్పిటల్ రోగులకు మెరుగైన సేవలను అందించడంలో విజయం సాధిస్తుందని ఆశాభావం వ్యక్తం చేశారు. ఈ హాస్పిటల్‌లోని వైద్య రంగ ప్రముఖులు ఆధునికమైన పరికరాలను, సౌకర్యాలను చక్కగా ఉపయోగించుకొని రోగులకు మంచి వైద్యసేవలు అందిస్తారని చెప్పారు. ఇక ముందు ఏర్పాటయ్యే ఎన్నో జిల్లా స్థాయి ఆస్పత్రులకు ఇది మార్గదర్శకంగానే కాక ఆదర్శంగా రూపొంది ముందుంటుందని ఆత్మ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు.

ఉన్నత స్థాయి ప్రమాణాలు గల హాస్పిటల్ కోసం కలలు గన్న సింహపురీయుల చిరకాల వాంఛ మా అపోలో హాస్పిటల్ ప్రారంభంతో తీరిందని నెల్లూరు అపోలో హాస్పిటల్ ఛైర్మన్ పి. ఓబులు రెడ్డి మా ప్రత్యేక ప్రతినిధితో చెప్పారు. విలువైన వైద్య చికిత్స కోసం రోగులు ఇక దూర ప్రయాణాలు చేయాల్సిన అవసరం లేదన్నారు. విలువైన సమయం వృధా చేయకుండా సకాలంలో వైద్య సదుపాయాన్ని పొందవచ్చునన్నారు. అత్యంత ఆధునికమైన సదుపాయాలతో పాటు రోగులకు మానసిక ఉల్లాసం కలిగించే అద్భుతమైన, ఆహ్లాదకరమైన పరిసరాల్లో దీన్ని నిర్మించామన్నారు. ఈ హాస్పిటల్ వల్ల కడప, చిత్తూరు, ప్రకాశం జిల్లాల ప్రజలకు వాలా సౌకర్యం కలుగుతుందని తెలిపారు. మద్రాసు, హైదరాబాదు అపోలో హాస్పిటల్స్ నుంచి వచ్చే నిపుణులైన మేటి డాక్టర్లు రోగులను పరిశీలించి ఎప్పటికప్పుడు పర్యవేక్షిస్తారని, వారి సేవలను సక్రమంగా వినియోగించుకునే సదుపాయం మరింత చేరువైందన్నారు.

ఫిధాలజీలో తలపండిన పండితుడు, ఆంధ్రప్రదేశ్ హెల్త్ సర్వీసెస్ రిటైర్డ్ ప్రిన్సిపాల్, ప్రొఫెసర్ శ్యామ సుందరరావు ఇలా తెలిపారు. ఫ్రోజన్‌సెక్షన్ బయాప్సీ, హార్మోనల్, డ్రగ్ అస్సేలు ఇమ్యూన్ డయాగ్నస్టిక్స్, బ్లడ్ బ్యాంకింగు మొదలగు ప్రత్యేక సదుపాయాలు అపోలో ఔన్నత్యాన్ని తెలుపుతాయన్నారు. అల్ట్రా సౌండ్ స్కానింగ్, ఎకోకార్డియాగ్రాఫ్, అత్యంత శక్తివంతమైన ఎక్స్‌రే పరికరాలు హాస్పిటల్ ఉన్నత ప్రమాణాలకు నిదర్శనమన్నారు.

దిగుమతి చేసుకున్న పరికరాల సహాయంతో గర్భస్థ శిశువుల ఆరోగ్య సమాచారాన్నికూడా మా హాస్పిటల్‌లో తెలుసుకొనవచ్చునని గైనకాలజిస్టు డా. సుగుణ చెప్పారు. ఇందువల్ల ప్రసవ సమయంలో గర్భస్థ శిశువుకు కలిగే ప్రమాదకర మార్పులను ముందుగా తెలుసుకొని ఖచ్చితమైన సమయంలో చికిత్స జరిపి అనవసర సిజేరియన్ ఆపరేషన్లు నిరోధించ వచ్చునంటారు.

ప్రత్యేక హృద్రోగ నిపుణులైన డా. రామచంద్రన్ గారు మాట్లాడుతూ గుండెజబ్బులను ప్రాథమిక దశలోనే గుర్తించేందుకు ఉపయోగపడే అత్యంత ఆధునికమైన కంప్యూటర్ పరికరాలతో కూడిన వైద్య సదుపాయాలు అపోలో హాస్పిటల్‌లో వుండటం పట్ల సంతృప్తి వ్యక్తం చేసారు.

ఇ.ఎన్.టి. నిపుణులు డాక్టర్ శ్రీధర్ రెడ్డి మాట్లాడుతూ స్వరపేటికకు సంబంధించిన ఆపరేషన్‌లే కాక Oral Cavity Cancerకు సంబంధించిన ఆపరేషన్లు చేయుటకు అపోలోలో అనువైన సౌకర్యముందంటారు. స్వరపేటిక ఆపరేషన్ తర్వాత మాటలు కోల్పోయిన వారికి తిరిగి ఆపరేషన్ ద్వారా మాటలు తెప్పించే వీలుందని తెలిపారు. థైరాయిడ్ గ్రంధికి సంబంధించిన ఆపరేషన్లు కూడా ఇక్కడ చేసే సౌలభ్యం ఉందని చెప్పారు.

ఎముకలకు సంబంధించిన శస్త్ర చికిత్సలో 12 ఏళ్ళ అనుభవం కలిగిన డాక్టర్ జగదీష్ షా ఇలా చెప్పారు. మా అపోలో హాస్పిటల్‌లోని 24 గంటల ఫ్రాక్చరు క్లినిక్‌లో ఎముకలు విరిగిన రోగులకు సమర్థవంతంగా సంపూర్తిగా బాగుచేయగలమని ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశారు. జాయింట్ మార్పు – శస్త్ర చికిత్సల వలన ఎంతో మంది అంగ వికలాంగుల జీవితాలను మేము మార్చగలమన్నారు. ఫిజియోథెరపీ, వ్యాయామాలు, అత్యంత ఆధునికమైన పరికరాలతో అనుభవం కలిగిన సిబ్బంది పర్యవేక్షణ ఉంటుందన్నారు. ఆధునికమైన ఆపరేషన్ థియేటర్స్‌లో A.O. (Switzerland) సూత్రాలతో రోడ్డు ప్రమాదాలలో సంభవించిన తీవ్రగాయాలకు శస్త్ర చికిత్స చేయడానికి ఎంతో వీలుందన్నారు.

సాధారణ పిల్లల విభాగంతో పాటు ప్రత్యేక చిన్నపిల్లల విభాగంలో అత్యంత ఆధునికమైన వైద్య ప్రమాణాలు అపోలోలో ఉన్నాయని విదేశాలలోనూ, స్వదేశంలోనూ అపార అనుభవం గడించిన డాక్టర్ గౌతమ్ బెనర్జీ చెప్పారు. అత్యవసర శిశు సంరక్షణ, ప్రత్యేకమైన Intensive Care Unit ఫొటోథెరపీ, ఎక్స్ఛేంజీ ట్రాన్స్‌ఫ్యూజన్ సౌకర్యాలున్నాయన్నారు. రోగ నిరోధక టీకాల విభాగంలో మామూలు టీకాలతో పాటు జపనీస్ బి ఎన్‌సెఫలైటిస్ మొదలగు రోగ నిరోధక టీకాలు వేస్తారన్నారు.

అనస్తీషియాలజీ విభాగంలో అనుభవజ్ఞులైన డాక్టర్ రాజగోపాలన్ తమ అపోలో లోని సౌకర్యాల గురించి వివరించారు. జర్మనీ దేశం నుంచి దిగుమతి చేసుకున్న Angenieux కోల్డ్ ఆపరేషన్ లైట్లు అమర్చిన అత్యంత ఆధునికమైన జంట ఆపరేషన్ థియేటర్లు ఉన్నాయి. ఆపరేటింగ్ మైక్రోస్కోపు సహాయంతో అతిసున్నితమైన శస్త్ర చికిత్సలను సమర్థవంతంగా, సులభంగా చేయడానికి వీలవుతుంది. సెంట్రల్ ఆక్సిజన్, సక్షన్ యూనిట్లు అమర్చిన నాలుగు పడకల ఇంటెన్సివ్ కారోనరీ యూనిట్ ఉన్న ఒకేఒక జిల్లాస్థాయి వైద్యశాల ఇది. అత్యంత క్లిష్టమైన తల మెడ, పొట్ట భాగాలకు చేయు శస్త్ర చికిత్సలను సులభంగా నిర్వహించే సామర్థ్యం గల అనేక ఆదునిక వైద్య పరికరాలున్నాయి. కృత్రిమ శ్వాస అవసరమైన రోగులకు రెస్పిరేటర్ల ద్వారా శ్వాస అందజేసే సదుపాయం, వీటి ద్వారా ప్రమాద పరిస్థితుల్లో ఉన్న చిన్న పిల్లలకు, పెద్దలకు, అంబులెన్స్ ద్వారా మార్గమధ్యంలో కూడా కృత్రిమ శ్వాస కల్పించే సదుపాయాలు ఉన్నాయంటారు.

నాలుగు సంవత్సరాల నిరంతర శ్రమ అనంతరం మేము ఈ రోజు నుంచి రోగులకు వైద్య సదుపాయాలందించుటకు సిద్ధంగా ఉన్నామని అపోలో హాస్పిటల్ సిబ్బంది తెలిపారు. ఈ సందర్భంగా మా ఛైర్మన్ పి. ఓబుల్ రెడ్డి గారికి, అపోలో గ్రూప్ ఛైర్మన్ డాక్టర్ ప్రతాప్ సి. రెడ్డికి వారి అపూర్వ ఆదరణకు, సహాయ సహకారాలకు వారు కృతజ్ఞతలు తెలిపారు. వారి సహాయ సహకారాల వల్లనే ఈ సంస్థ మరింత పురోగమిస్తుందని, నెల్లూరీయుల కల నిజమైందని అన్నారు.

మా దృష్టికి వచ్చిన మరిన్ని సౌకర్యాలివి.

ప్రత్యేక చికిత్సా విభాగంలో

1. ఇన్‌ఫెర్టిలిటీ క్లినిక్
2. ఒబిసిటీ క్లినిక్
3. అలర్జీ క్లినిక్

హృద్రోగులకు అందుబాటులో అత్యవసరమైన సదుపాయం. మంచి ప్రవర్తన, శిక్షణ, వృత్తి అనుభవంగల పారా మెడికల్ ఉద్యోగులు.

ఆధునిక సాంకేతిక విలువలు కల వైద్య పరికరాలు.

అన్ని రకాల శరీర అంతర్ భాగాలను పరీక్షించగల వైద్య సాధనాలు.

సంపూర్ణ రోగ నిర్ధారక పరీక్షలు.

అప్రమత్తతతో సేవలందించే హౌస్ మేనేజర్లు.


## అపోలో హాస్పిటల్–నెల్లూరు

# 60 సంవత్సరాల జమీన్‌రైతు ఇప్పుడు 25,000 గడపలు చేరనుంది

జమీన్‌రైతు – నెల్లూరీయులకే పరిమితమైన పత్రిక ; ప్రతి నెల్లూరీయుడూ గర్వపడే పత్రిక ; అరవయ్యేళ్లపాటు నిరంతరాయంగా ప్రచురింపబడుతున్న ఒకే ఒక తెలుగు పత్రిక; నిష్పాక్షిక విమర్శలకు, నిర్మొగమోట వ్యాఖ్యలకు పేరొందిన పత్రిక ; నెల్లూరు నుడికారాన్ని సజీవంగా నిలుపుతున్న పత్రిక—జమీన్‌రైతు.



అరవయ్యేళ్ల అనుభవంతో ఇప్పుడు జిల్లాలో ఇంటింటా సమాచార జ్యోతి వెలిగించ సంకల్పించాము. చందాదారుగా చేరి మీ ముంగిట వారం వారం వార్తాతోరణం అలంకరించే అవకాశం కల్పించమని విజ్ఞప్తి చేస్తున్నాము.




ఉప్పుకారం లేని చప్పిడి సమాచారం అందించే దినపత్రికల వ్యయం ఈనాడు నెలకు అరవై రూపాయలు. వార్తకు కారం, మసాలా దట్టించి, రుచికరంగా తీర్చిదిద్ది, అందించే జమీన్‌రైతు చందా నెలకు కేవలం ఆరంటే ఆరు రూపాయలు. పదింతలు తక్కువ ధరకు పదిరెట్లు అధికమైన వార్తలు మీకంద జేస్తుంది జమీన్‌రైతు. ఏ దినపత్రికకూ తీసిపోని ఆధునిక కంప్యూటర్‌ల సహాయంతో, రంగుల ముద్రణతో మిమ్మలరిస్తుంది.

## ముచ్చటైన
## జమీన్ రైతు చందాదారులైతే మీకు 3 లాభాలు

**1** మీరు కొత్తగా చందాదారుగా చేరగానే జిల్లా బయట, ఇరుగు పొరుగు జిల్లాలలో, ఢిల్లీ, కలకత్తా, మద్రాసు, హైదరాబాద్ వంటి నగరాలలో, అమెరికా, ఇంగ్లాండు, ఇరాన్, సౌదీ అరేబియా వంటి దేశాలలో నివశించే మీ మిత్రులు, లేదా బంధువులైన 10 మంది నెల్లూరీయులకు కొంత కాలం పాటు, మీ కానుకగా 'జమీన్‌రైతు 'పత్రిక ఉచితంగా పంపబడుతుంది. పోస్టేజీ కూడా ఉచితమే ;

**2** చందా దారుల నుండి ఎంపిక చేసిన కొందరికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి. ఆ పైన మీరు, మీ కుటుంబసభ్యులు విద్యలో, వ్యాపారంలో, ఉద్యోగంలో, వృత్తిలో, ఆటలలో, కళలలో సాధించే ప్రతి చిన్న విజయానికి పత్రికలో వార్తగా ప్రచురించే అవకాశం లభిస్తుంది.

**3** జిల్లాలో జరిగే ప్రతి సంఘటన పైనా విశ్లేషణాత్మక విమర్శతో, నిష్పక్షపాత వ్యాఖ్యతో, తాజాగా, వేడి వేడి వార్తలు మీ కందుతాయి. జిల్లా సమాచారానికి సంబంధించి మిమ్మల్ని అందరి కంటే ముందు నిలుపుతాయి.

జిల్లా బయట వుండే వారికి జమీన్‌రైతు కానుకగా పంపడమంటే, మీరు వారికి స్వయంగా వారం వారం జాబు వ్రాయడంతో సమానం. జిల్లాలో మీ ఊరిలో జరిగే ప్రతి సంఘటన, రాజకీయాలు, ప్రకృతి ప్రళయాలు, నేరాలు, అభివృద్ధి, సమస్యలు, జిల్లావాసులు సాధించే విజయాలు, సాహిత్యసభలు, సాంస్కృతిక కార్యక్రమాలు..... ఒకటేమిటి – ఆఖరుకు పెళ్ళిళ్లూ, మరణాలతో సహా ఎప్పటికప్పుడు మీ స్నేహితులకు సమాచారమందుతుంది. వారికి స్వంత జిల్లాలోనే వున్న అనుభూతి కల్గిస్తుంది.

చందాదారుగా చేరడానికి నేను సమ్మతిస్తున్నాను. చందా మొత్తం రూ. 75లు / డిడి / ఎం.ఓ / చెక్కు ద్వారా పంపుతున్నాను. దయచేసి నా మిత్రులు 10 మందికి పత్రిక ఉచితంగా పంపండి

సంతకం

చిరునామా ........................................................

........................................................

........................................................

చందాపంపవలసిన అడ్రసు : జమీన్‌రైతు నెల్లూరు – 524001

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books Pvt. Ltd, Nellore.